


# విషయసూచిక

(సెప్టెంబరు 50)




ఎడిటర్ : పందిరి మల్లికార్జునరావు

| సంపుటము 2 | సెప్టెంబరు 1950 | సంచిక 8 |
|---|---|---|

# లేపాక్షి కళానిక్షేపం

లేపాక్షి అనంతపురం జిల్లాలోని హిందూపురానికి తొమ్మిది మైళ్ల దూరాన ఉన్న ఒక కుగ్రామం. విజయనగరాధీశుల కాలంలో ఈ లేపాక్షి వర్తక, వాణిజ్యాలకు కేంద్రంగా విలసిల్లి ఉన్నతి స్థితి నందినది.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో విరుపన్న, వీరభద్రన్న అను భక్తులిరువురు శైవ దేవాలయా న్నొకటి కట్టించి, అప్పటి సుప్రసిద్ధ చిత్రకారులచే ఉత్తమ చిత్ర శోభితంగా చేశారు. ఇది శైవ క్షేత్రమైనా విష్ణ్వాలయంకూడా ప్రతిష్ఠించబడినది.

శిల్ప సంపద :

ఈ దేవాలయం లేపాక్షి అనే ఒక గుట్టమీద ఉన్నది. దేవాలయం నాట్య మండపంలోని స్థంభాలమీద, గోడల మీద గంధర్వుల చిత్రాలు, యక్షుల చిత్రాలు చిత్రింపబడ్డాయి. విష్ణు దేవాలయం పైకప్పు లోపలి భాగంలో దశావతారాలు చిత్రితమై ఉన్నవి.

మహామండపం లోపలి గోడలపై భారత, భాగవత, రామాయణాది గ్రంథాల లోని విషయాలు అపూర్వంగా చిత్రింపబడ్డాయి.

విస్మృత స్థితి :

అయితే, ఇట్టి అపూర్వ కళా సంపదతో కన్నుల పండుగు చేయు ఈ దేవాలయం ఔన్నత్యం విస్మరింపబడి, ప్రజాదృష్టి నుంచి మరుగుపడినది. కాని,

రాయలసీమలోని సుప్రసిద్ధ నాయకులు, సంస్కృతీ సంపన్నులు అయిన శ్రీ కల్లూరి సుబ్బారావుగారి కృషి ఫలితంగా ఈ విస్మృత కళానిక్షేపంలోని అసమాన చిత్రాలు కళాభిలాషుల దృష్టిపథమును అందుకొనినవి.

జీర్ణ శీర్ణమైన ఈ కళా ఖండాల ప్రతి కృతులను తయారు చేయించి, ఏతద్దేవాలయ చరిత్ర, అందులోని కళా చిత్రాల వివరణతో కూడిన గ్రంథాన్ని ఒకదానిని ప్రకటించుటకు నిశ్చయింపబడినది. శ్రీ సుబ్బారావుగారి అధ్వర్యాన ఒక సంఘం ఏర్పడి, ఈ కార్యక్రమానికి సన్నాహాలు చేశారు. ప్రభుత్వ సహాయం, ప్రజాసహకారం రెండూ లభించాయి ఈసంఘానికి. ఇతోధికంగా సహాయం లభించడం అవసరం.

శిల్పకళా ప్రదర్శనం :

సుప్రసిద్ధ చిత్రకారులైన శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి, శ్రీ కె. శ్రీనివాసులుగార్లు ఈ దేవాలయంలోని చిత్రాలకు ప్రతికృతులను తయారుచేశారు. చిత్రాల ప్రతికృతులు చెన్నపురిలో ఇటీవల ప్రదర్శింపపడినవి.

శ్రీ యు. కామేశ్వరరావు, శ్రీ సుదర్శనంగార్లు కూడ కొన్ని రేఖా చిత్రాలను తయారుచేశారు. అవికూడ ఇందు ప్రదర్శింపబడ్డాయి.

ఇట్టి ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసి, చెన్నపురిలోని కళారాధకులు సందర్శించుటకు అవకాశం కల్పించిన ప్రదర్శనాధికారుల ప్రయత్నం ప్రశంసనీయం.

సాంస్కృతిక సమన్వయం :

ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ, ప్రాచీన కాలంలో దేవాలయాలే విజ్ఞాన కేంద్రాలు అనీ, భరతనాట్యం, చిత్రకళ, శిల్పం, వేదాంతగోష్ఠి,అన్నిటికీ నిలయాలుగా ఉండేవనీ, అజంతా, బాగ్, సీగిరియా (సింహళం) పంచి, తిరుపురాన్‌కుండ్రం వీటన్నింటి శిల్పకళ ఒకదాని కొకటి సంబంధించి ఉన్నదనియు నుడివిన మాటలు పరికింపదగినవి.

భారతీయ చిత్రకళను, శిల్పకళను తదితర లలితకళలను ఈ దృష్టికోణం నుంచి పరికించినయెడల సంస్కృతీ సమన్వయాన్ని అర్థం చేసుకోవచ్చు. భారతీయ సంస్కృతిలోని తత్వార్థాన్ని అప్పుడే గుర్తించ గలుగుటకు అవకాశమేర్పడ గలదు.

కళామయ జీవితం :

జీవితం కళామయం. కళాశూన్యమైన జీవితం ఉచ్ఛృంఖలతకు దారితీయగలదు; జీవితంలోని మాధుర్యం కుంటు పడగలదు. కావున, మానవుని జీవితం

సుసంపన్నం కావలెనంటే జీవితాన్ని కళాసంపన్నం చేయాలి. లలితకళలు నిత్య జీవితంతో పెనవేసుకుపోవాలి.నాడు జీవిత పరమార్థం పరిపూర్ణంగా అనుభవము లోనికి రాగలదు.

పాఠశాలలు, కళాశాలలలో కళకు ప్రవేశం కలిగించాలి. అప్పుడది జీవితంలో స్థానం ఏర్పరచుకుంటుంది. అప్పుడు జీవితం కళాత్మకం అవుతుంది. శాశ్వతానంద దాయకమైన సత్య, సౌందర్యాల అన్వేషణకు. ఆరాధనకు అప్పుడవకాశం ఏర్పడగలదని ఆచార్య రజిన్ను లేపాక్షి చిత్రప్రదర్శన మహోత్సవ సందర్భంలో వెల్లడించిన ఉన్నతాభిప్రాయం అనుసరణ యోగ్యం.

**తెలుగుజాతి కళాసంపద :**

తెలుగువారు కళాపిపాసులు. కళామయజీవితం తెలుగుజాతి నిత్యజీవితంతో ఏకత్వాన్ని పొంది, జాతి నంతను కళారాధకులనుగ జేసివైచినది. తెలుగుభాష, తెలుగు వాఙ్మయం, తెలుగు గడ్డ కళాసౌందర్యంతో పరిఢవిల్లి, తెలుగుజాతి ఒక అపూర్వమైన వినూత్న శోభాసంపదతో విలసిల్లుతున్నది.

సాహిత్యం, చిత్రకళ, శిల్పకళ మొదలగునవన్నియు తెలుగు గడ్డపై పెంపొంది, పరాకాష్ఠ నందినవి. తెలుగునాడులో అడుగడుగున శిల్పకళాఖండాలు వెదజల్లబడి ఉన్నవి.

అమరావతి, నాగారున కొండ, లేపాక్షి, హంపీ మొదలుగాగల వన్నియు తెలుగువారి ప్రాభవానికి, పరిఢవానికి అపూర్వ నిదర్శనాలు. అట్టి కళాసంపదను పరిరక్షించుకోవడం తెలుగుజాతి ప్రథమ కర్తవ్యం; పవిత్ర ధర్మం.

**శిల్ప క్షేత్రాలు :**

ఒకనాడు బౌద్ధ క్షేత్రాలుగ నుండి విద్యల కాలవాలమైన అమరావతి మొదలగునవి నేడు జీర్ణావస్థలో నున్నవి. ప్రతి తెలుగు పౌరుడు తమ శిల్పక్షేత్రాలను దర్శించి. తన జాతి పూర్వ వైభవంతో పరిచయం కలిగించుకోవాలి. విస్మృత గర్భంలో లీనమయిపోయిన కళానిక్షేపాలను బయటకుతీసుకురావాలి.

**మ్యూజియములు :**

ఈ కళాఖండాలు ప్రజల అందుబాటులో ఉండవలెనంటే వాటి నన్నిటిని ఏకత్రితంచేసి, ప్రదర్శన శాలలను నిర్మించాలి; వీటినిగూర్చి ప్రజలకు తెలియజెప్పగల పండితులను నియోగించాలి; తత్సంబంధమైన పుస్తకాలు, ఆల్బమ్ము ప్రకటించి, కళారాధనకు తెలుగుజాతి నంతయు సమాయత్త పరచాలి.

# సౌందర్యంలో వాస్తవికత

శ్రీ తుమ్మలపల్లి సీతారామారావు

మానవుడు ఊహాప్రపంచంలో చిత్రించుకున్న ఎన్నో అందాలు స్వప్నరూపంతోనైనా సాక్షాత్కరించకుండానే జగత్తు సాగిపోతూంది. హేతువాదులైన మానవుల కర్కశ హస్తాలలో, లభించిన లేశమైన అందము నశిస్తూంది. అందువల్లనే సౌందర్యం విస్తృతం జేసే ఆనందం, రసానుభూతి, సుముఖత గల శోధకుల మనసులోమాత్రమే ప్రతిబింబిస్తుంది. సంశయగ్రస్తుడైన మానవుడు, సౌందర్యానికి హేతువులైన సాధారణాంశమును గుర్తించడంలోను సుందరమైన వస్తువులను గురించి పూర్వపరిచయం, అనుభవం లేని నిర్ణయాలు చేసుకొనడం వల్లను అభిరుచులలో వైవిధ్యం ఏర్పడుతుంది.

సౌందర్య నిరూపణకు చేసే అన్వేషణలో మొదటినుంచి, వాస్తవికత ప్రముఖ సమస్యగా ఉంటూంది. అభిరుచులలో మంచి, చెడు అనే రెండు గుణా లున్నాయని మనం అంగీకరిస్తున్నప్పటికీ ఏది మంచి గుణం అని మనం ఇంతవరకు నిర్ధారించలేక పోతున్నాము. సౌందర్య స్వరూపాన్ని గురించి భిన్నాభిప్రాయాలు కనపడడంవల్ల, సుందరమైన వస్తువులలో అది స్వాభావిక లక్షణమని స్పష్టమౌతూంది. ఒక వస్తువు సుందరమైనది అని చెప్పినపుడు మనం పొరపడడానికి కూడా అవకాశం వుంది. కొన్ని వస్తువులపట్ల మనకు గల సుముఖత్వం వల్లనే, వాటి సౌందర్య నిరూపణ జరుగుతుందనుకుని అంగీకరించినపుడు, వాటియందు గల సహృదయత్వం ముందే ఏర్పడినపుడు పొరబడడానికి అవకాశం లేదు. భవిష్యత్కాలంలో కొన్ని వస్తువులు సుందరంగా ఇతరులకు, మనకు గూడా అగుపిస్తవని భావించడం పొరపాటు. సౌందర్యం, కొన్ని వస్తువులపట్ల మనకు గల కేవల సుముఖత్వం గాదు. కొన్ని వస్తువులు అందమైనవి అని మనం చెప్పినపుడు, వాటియెడల మనకు గల సుముఖత్వాన్ని పురస్కరించుకొనే మనం ఆ నిర్ణయం చేయడానికి వీలౌతుందనే అంశం నిర్వివాదం. అనుభవము, పరిచయము, మనస్తత్వము ఒక వస్తువుయొక్క సౌందర్య నిరూపణలో ప్రధానంగా ఉపకరించే అంశాలు. కాని పైన చెప్పిన అంశాలవల్ల కలిగే అనుభూతి మాత్రమే సౌందర్యం అని చెప్పడం అసంగతం. వస్తువుల పరిమాణం, బరువు, చలనం మొదలైన వాటివలె సౌందర్యం వస్తువులయొక్క భౌతిక లక్షణం గాదు. ఈ లక్షణములవలె ఇతర భౌతిక లక్షణములపై సౌందర్యానికి ప్రోద్బలం లేదు. మనస్సుకు ప్రోద్బలం కలిగించే శక్తి సౌందర్యానికి వుంది. సత్యము, మంచితనము, ఇవి రెండూ సౌందర్యం కాదని అందరు

అంగీకరించారు. ఈ రెండు గుణాలు, వస్తువుల పట్ల మనకు గల సుముఖతకు వ్యక్తిగతంగా ప్రోద్బలం కలిగిస్తవి. ఎవరు ఇంత వరకు చూడనిది, చూడడానికి అవకాశంలేనిది అయిన వస్తువు సుందరంగా వుంటుందని చెప్పడం విచిత్రమైన విషయం. అలాగే అందరు చూచే వస్తువును గురించి, వారు భావించని అందం ఆవస్తువులో వుందని చెప్పడం కూడా విచిత్రమైన విషయమే. అటువంటి సౌందర్యం అర్థరహితమైంది.

రంగు, శబ్దము, ఈ రెండు లక్షణాలు సౌందర్యాన్వేషణలో వాస్తవికత తరువాత ప్రముఖంగా కనుపిస్తున్నవి. వాయుపీడనం వల్ల మనస్సుకు పరిణామ దశను కల్పించి నరముల కదలికను ఉత్పాదించేవి రంగు, ధ్వని అని శాస్త్రం చెపుతూంది. అయితే సౌందర్యం వస్తువులయొక్క గుణమేనా అనే ప్రశ్న కలుగుతుంది. అందమైన ముద్రణలోని కవిత పఠితకు ఆనందం కలిగిస్తుంది. ఆది కావ్యమైన రామాయణం ముద్రాపితం కాక పోయినప్పటికి శ్రోతలకు, పఠితలకు రమ్యానుభూతి కలిగించింది. లిఖిత రూపం పొందని అనేక ప్రాచీన నుడులు, రచనలు అనేక ఆనంద వాహినులు మానవ దృష్టికి గోచరించనివి అనేకం ప్రచ్ఛన్నంగా ఉన్నవి. వీటిలో కొన్ని రమ్యకవితలు వుండవచ్చును. సౌందర్యం వీటిలో ఉందా అనే ప్రశ్న కలుగడం సహజం. నూట యాభై సంవత్సరాల క్రితం ముగ్ధత కలిగించిన చిత్తరువులు, కవితలు ఈనాడు పేలవంగా కనుపించవచ్చును. వీటిలో సౌందర్యం ఎక్కడ ఉంది? సౌందర్యం పోకార్చుకొనిన ఆ చిత్తరువులు, కవితలు ఇప్పుడు ఎక్కడ ఉన్నవి? వీటివల్ల, కవిత్వం లోని సౌందర్యం పఠితల మనస్సులోనే ఉంటుందనే విషయం స్పష్టపడుతుంది. మనసులో రూపొందని సౌందర్యానుభూతి ఆవృతిలో నిలిచి యుంటుంది. ఇవే శబ్ద, చిత్ర రచనలు. ఒక ప్రసిద్ధ వేదాంతి నుడివి నట్లు, వస్తువులు ఏమి స్ఫోరకం చేయవు. కాని మానవుడే వాటిని చూచి భావోత్తేజం పొందుతాడు. స్వాభావిక సౌందర్యం ఉత్తేజం కలిగిస్తుంది. వస్తువు వ్యక్తపరిచే నిగూఢ ప్రతిభకంటె ఉత్తేజశక్తి అధికంగా ఉంటుంది. అప్రయత్నంగా వచ్చిన చిరునవ్వును చూచిన ద్రష్ట సౌఖ్యాన్ని భావించినట్లే, గులాబి మొగ్గను చూచినపుడు కూడా యవ్వనంలోని యువకుణ్ణి ఊహిస్తాడు. కవి, చిత్రకారుడు తమ రచనలలో వ్యక్తపరిచే ఊహల సొంపును ద్రష్టలు కీర్తిస్తారు; ఆనందిస్తారు.

వాస్తవికత లోపించడంవల్ల సంగీతంలోను, నాటకంలోను తటస్థించే అభ్యంతరాలు, నటీనటులకు సభలు జరిపే గాయకులకు తటస్థిస్తున్నవి. నాటక రచన చేసిన కవి భావనకు సమీపించడానికి బదులు నటుడు స్వీయ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడానికి కృషి చేస్తున్నాడు. ఇటువంటి లోపమే చిత్రలేఖనంలో, శిల్పంలో కూడా వ్యక్తమౌతుంది. కళాసృష్టిని పరిశీలించేటప్పుడు స్వీయ ఊహాకల్పనాశక్తిని విసర్జించి, కళాకారుని మనోభావాన్ని అందుకో గలిగిన సన్నిహితత్వం ఏర్పరచుకోవాలి. శబ్దంలో కవి చిత్రణ చేసిన కావ్యసౌందర్యాన్ని గ్రహించి ఆనందించడానికి పఠితకు గల ఊహాశక్తి, సంభావనీయత ప్రధాన గుణాలు.

స్వాభావిక సౌందర్యం గల వస్తువులలో చారిత్రిక-ఆసక్తి కనుపడదు. సూర్యాస్తమయం, కొండ, వీటికి సరి అయిన నిర్వచనం కనుపడదు. ఆలింకారిక దృష్ట్యా వీటిలోని సమగ్ర సౌందర్యాన్ని గుర్తించి గ్రహించటమే మన అన్వేషణకు పరమావధి. అత్యధిక సంఖ్యగల స్వాభావిక వస్తువులలో గల విశేష సౌందర్యం గ్రహించ గలిగిన వానికి విశిష్టమైన అభిరుచి వుందని మనం గ్రహిస్తాము. కళాస్రష్టలను గురించి కూడా ఎందుకు మనం ఇదే అభిప్రాయం కలిగియుండ కూడదనే ప్రశ్న కలుగుతుంది. కొన్నికవితలు, చిత్తరువులు, సవామూర్ఛనలు ఆనందించటం చెడ్డ అభిరుచి గాని మనం ఎందుకు అంటున్నాము? సుందరమైన వస్తువులలో సౌందర్యంగాక మరియొకటిగాని అంతకు అధికంగా గాని సాధారణంగా వుండే ప్రత్యేక లక్షణములను పోల్చుకోవటంలో జరిగే పొరపాటులే అభిరుచిలోని భిన్నత్వానికి కారణం. కేవలం ఆకర్షణీయంగా ఉన్నంత మాత్రంలో ఒకవస్తువు అందమైనదని చెప్పడం పొరపాటు. ఆ వస్తువుతో గల పూర్వ పరిచయంవల్ల సౌందర్యాన్ని సులువుగా గుర్తించ గలుగుతున్నాము. ఒక వస్తువుపట్ల మనకు గల సుముఖత్వమే దాని సౌందర్యం అని చెప్పుకోవడంతో, సౌందర్య లక్షణాన్ని, విశిష్టతను మనం న్యూనత పరుస్తున్నాము. మన అనుభవానికి సౌందర్యం పర్యాయ పదంగాదు. ఆనందం, సౌఖ్యం ఇవి రెండూ మానసిక అనుభూతులు. ఇదేవిధంగా ప్రేమ, సాహసం మానసిక ఆనందం కలిగిస్తవి. కేవల భౌతిక ప్రపంచంలో ప్రేమకు స్థానం లేదు. ఒక మనోప్రవృత్తికి ఇంకొక మనసుతో గల సంబంధమే ప్రేమ అని శాస్త్రకారుల నిర్వచనం. తాము గాఢంగా ప్రేమించిన వారిలో అపూర్వ గుణ సంపదను భావన జేసి ప్రేమికులు మానసికంగా తృప్తి పొందుతారు. సుందరమైన కొన్ని వస్తువులు ప్రేరేపించే అభిమానాన్ని పురస్కరించుకొని అటువంటి వాటిని అందమైన వస్తువులని మనం చెపుతాము. ఆ వస్తువులు మానసికంగా ఆనందం కలిగిస్తవి. అటువంటి ప్రేరణ కలిగించే శక్తి సుందరమైన ఆ వస్తువులకు యుండాలి. అట్టి

వస్తువులలో ప్రధానంగా వాస్తవికత గల వస్తువులలోని అందం ఎల్లప్పుడు అందరికీ ఆకర్షణీయంగా వుండి మానసికంగా ఆనందం కలిగిస్తుంది. మానవుడి ఊహాపరిణతి ననుసరించి రూపులు దిద్దుకొనిన కళాసృష్టులు ప్రస్ఫుటం చేసే సౌందర్యాన్ని గ్రహించడంలో మనకుగల అవకాశాలు సంకుచితంగా ఉంటవి. మానవ సౌందర్య నిరూపణలో కూడా ఈ వాస్తవిక సత్యం ధృవపడుతుంది. కాని అభిరుచులలో మంచి, చెడు అని రెండు భిన్న పద్ధతులు గలవనే విశ్వాసాన్ని ఈ సిద్ధాంతం పూర్వపక్షం చేస్తుంది. సౌందర్యం మానసిక అనుభూతి. అది వస్తులక్షణం కాదు. అందువల్లనే సౌందర్యంలో రెండు భిన్నపద్ధతులు గోచరిస్తున్నవి. వీటిలో మొదటిది కేవల సౌందర్యం. రెండవది కృత్రిమ సౌందర్యం. అందానికి గల ప్రత్యేక సాధారణ లక్షణాన్ని గుర్తించడంలో పొరపాటు పడడంవల్ల కేవలం కొన్ని వస్తువులు అభిమానం ప్రేరేపించడంవల్ల, అటువంటి వస్తువు లన్నిటిని అందమైన వస్తువులని చెప్పడంతో ఈ అవ్యవస్థ ఏర్పడుతూంది. ఇందువల్లనే అభిరుచులలో మంచి, చెడు అనే వైవిధ్యం స్ఫోరకమౌతూంది. దీనిని అభిరుచిలోపం అని చెప్పడానికంటె తాత్విక శక్తిహీనత అనడం సమంజసంగా ఉంటుంది. శాస్త్రానుభవానికి, అలంకారికానుభవానికి మధ్యమార్గం నైతికానుభవం. వాస్తవికతను గురించిన ఈ విశ్వసనీయసిద్ధాంతం ప్రముఖమైంది. సౌందర్యాన్ని గురించిన అనుభవం, అనుభూతి పొందేవ్యక్తుల విశ్వాసంమీద కూడా ఆధారపడియుంటుంది. మానవ విధ్యుక్తవిశ్వాసానికి, ధర్మానికి విరుద్ధమైన అభిప్రాయం గలవాళ్ల అభిరుచి మంచిది గాదని ధృవపడుతూంది. సౌందర్య నిరూపణను గురించి ఏర్పరచుకొనే నిర్ణయం కేవల సాంప్రదాయాన్ని అనుసరించి గాని, అతీత అభిప్రాయాన్ని పురస్కరించుకుని గాని యుండడం ఒకప్పుడు ప్రమాద కారణమౌతుంది. సుందరమైన వస్తువులు కలిగించే ఇంద్రియానుభూతి, ప్రేరణల కంటెను, రసాస్వాదనపరుని వాటిపట్ల సౌహార్దభావన కలిగియుండడం అవసరం. శోభనలను అభిరుచిపట్ల నిర్లిప్తత కూడా యుండినప్పుడు అన్వేషణ సుకరమౌతుంది.

ఇది నూతన సిద్ధాంతం కాదు. విమర్శకుడు అభిరుచి గలవాడు అయి ఉండాలి. విషయ పరిశీలనలో ఆసక్తి, ఉత్సాహము అవసరం. మనోవ్యాపారంలో భిన్నాంశములలో వలె, కళావిషయాలలో కూడా తీర్పు నేర్పు ఆస్వాదనాపరుడి సంభావనీయత మీద నాధారపడి యుంటుంది.



కిన్నెర ప్రతులను అమ్మకు ఏజంట్లు లేనిచోట్ల
ఈ క్రింది షరతులపైన ఏజంట్లు కావాలి

※

## ఏజన్సీ షరతులు

※

1. ప్రతి ఏజెంటూ నెలకు కనీసం 6 కాపీలు తెప్పించాలి. అమ్మకం కాని కాపీలు వాపసు తీసుకోబడవు.
2. ఏజెంట్లు తమ ఏరియాలోనే "కిన్నెర"ను అమ్మాలి.
3. సంచిక వెల ఎనిమిది అణాలు. ప్రత్యేక సంచిక వెల ఆయా ప్రకటనకాలమందు నిర్ణయించబడుతుంది.
4. ఏజెన్సీ కమీషను నూటికి 25 చొప్పున ఇవ్వబడుతుంది
5. ప్రతినెలా ఏజెంట్లు తమకు కావలసిన కాపీలకు 10-వ తేదీలోపున అందునట్లు ఆర్డరు పంపాలి.
6. ఆర్డరుతోపాటు తమకు కావలసిన కాపీలకు కమీషను మినహాయించి సొమ్ము పంపవలెను.
7. పత్రికలు పంపడానికి పార్సెలు ఖర్చులు. పోస్టుఖర్చులు చార్జీ చేయబడవు. చెక్కులకు మనియార్డర్లకు అయ్యే కమీషను ఏజంట్లే భరించాలి.
8. చందాదార్లను చేర్చడానికి ఏజంట్లకు అధికారంలేదు.

※

టెలిగ్రామ్సు : "రీటా"　　టెలిఫోన్ : 55068
మేనేజరు, కిన్నెర
16, జోన్సువీథి, మద్రాసు 1

# నూతన రాజ్యాంగ

## వాటికి సంబం

ప్పున దేశంలో క్రొత్త రాజ్యాంగ చట్టము క్రింద ఎన్నికలు 1951 సంవత్సరములో జరుగునని అధికార రీత్యా ప్రకటింపబడినది. కొందరు ఆనిర్ణయమును గురించి అనుమాన ములు వెలిబుచ్చుచుండునప్పటికిని. వాటిని పాటింప వలసిన అవసరము లేదని నా అభి ప్రాయము. ఎన్నికల కాలము ఇదమిత్థమని స్పష్టముగ ఇప్పుడు చెప్పలేక పోవుచున్నను, కాని 1951 ఏప్రియల్ ఆగస్టు నెలల మధ్య కంటె ఆలస్యమగుననుట కవసరము కనిపించదు. ఈ ఎన్నికలయొక్క ప్రాముఖ్యత. వాటికి సంబంధించిన సమస్యల క్లిష్టత్వము అందరికు తెలిసినదే. మొదటి విషయము : ఈ ఎన్నికలు స్వాతంత్ర్య భారతదేశములో మొదటి సారి జాతీయ పార్లమెంటు, రాష్ట్ర శాసన సభలను ఎన్నుకొనుట కేర్పడినవి. భారత దేశ ప్రజాస్వామ్య రాజ్యాంగమును గట్టి పునాదు లపై ఏర్పాటు చేయుటకు ఈ ఎన్నికలు ప్రథమ సోపానములు. రెండవ విషయము : వయోజన వోటింగు సిద్ధాంతము క్రింద ఈ ఎన్నికలు జరుపబడుచుండుటచే. దీనికి సంబంధించిన వివిధ విషయములను పూర్తిగ ఆలోచించి దానికి అవసరమగు ఏర్పాట్లన్నియు చేయవలసి యున్నది. వయోజన వోటింగు పద్ధతి ననుస రించి వోటర్ల లిస్టులను తయారుచేయుట, వాటిలో లోటుపాటులు లేకుండ సరిచూచుట, దేశము వివిధ నియోజక వర్గములుగా విభ జించుట, ఎన్నికలు జరుపుటకు కావలసిన విధంగము నంతయు ఏర్పాటు చేయుట— ఈ పనులన్నియు జరుగవలసి యున్నది.

వయోజన వోటింగు సిద్ధాంతము ప్రకారము దేశ మంతటను ఎన్నికలలో పాల్గొనుటకు హక్కు కల్గియున్న వోటర్లు సుమారు 17 కోట్లు ఉన్నారని అంచనా వేయబడినది. ఇంతమంది వోటింగు అధికారము గలవారు ఏ ఇతర ప్రజాస్వామ్య దేశములోను కూడ లేరనియే చెప్పవచ్చును. 21 సంవత్సరముల వయస్సు కలిగి, మానసికముగ ఎట్టి లోటు లేక, మూడు నెలలు భారత దేశములో నివ సించియుండి పౌరసత్వపు హక్కును కల్గినట్టి ప్రతి పురుషుడును, స్త్రీయు ఓటర్ల జాబితాలో చేర్చబడుటకు రాజ్యాంగ చట్టము ప్రకారము అవకాశమున్నది. ఇట్లు తయారు చేయబడిన ఓటర్ల జాబితాలు సరియైనవా, కావా యని సరి చూచి, అనంతరము వాటిని ప్రచురింపవలసి యున్నది. దీనితోబాటు నియోజక వర్గముల ఏర్పాటు ఏ పద్ధతిపై జరుగ వలెనను విష



కి న్నె ర

# చట్టముక్రింద ఎన్నికలు

## ధించిన సమస్యలు

శ్రీ చా. వెం. హనుమంతరావు



యము కూడ ఆలోచించి నిర్ణయించవలసి యున్నది. వీటి నన్నింటిని ఆలోచించుటకు, నిర్ణయించుటకు పార్లిమెంటుకు సంపూర్ణ అధికారము కలదు. ఈ ఎన్నికలు జరుపుటకు, దీనికి కావలసిన పరికరములను సమకూర్చుటకు, ఏర్పాట్లు చేయుటకు ఎన్నికల కమిషన్‌ను రాజ్యాంగ చట్టము క్రింద ఏర్పాటు చేయవలసి యున్నది. ఎన్నికల కమిషనర్ అప్పుడే ఏర్పాటయి, తగు చర్య తీసుకొనుచున్నాడు.

ఈ సందర్భములో జ్ఞాపకముంచుకోవలసిన విషయములు కొన్ని కలవు. సుమారు 40 సంవత్సరములకు పైగా, అనగా 1908-1909 లో ఏర్పాటు కాబడిన మింటో-మార్లే సంస్కరణముల సమయము నుంచి మన దేశములో మత, కుల విచక్షణపై ఆధారపడినట్టి ప్రత్యేక నియోజక సిద్ధాంతముపై శాసన సభలకు ఎన్నికలు జరుగుచుండెడివి. వివిధ మతములకు చెందినవారు, వివిధ వర్గములకు చెందినవారు వారి ప్రతినిధులను మామూలు నియోజక వర్గముల ద్వారా కాక ప్రత్యేక నియోజక వర్గముల ద్వారా ఎన్నుకొనుచుండిరి. ఈ ప్రత్యేక నియోజక వర్గములనుండి ఎన్నికలు జరుపుచుండుట వలన రాజకీయ విషయములలో వివిధ మతస్థుల మధ్య, వివిధ కుల కక్షల మధ్య సఖ్యత, ఏకాభిప్రాయము పెంపొందుటకు బదులు, విభేదములు, కక్షలు పెరుగుటయు, చివరకు వాటి ఫలితముగ భారతదేశము విభజింపబడుటయు అందరకు తెలిసినదే. మన క్రొత్త రాజ్యాంగ చట్టములో ప్రత్యేక నియోజక వర్గములు, ప్రత్యేక స్థానములు, ప్రత్యేక వోటింగు పద్ధతి-ఇవన్నియు

తొలగింప బడినవి. నిమ్న జాతులకును, అడవి జాతులకు సంబంధించినంత వరకు మాత్రము, 10 సంవత్సరముల వరకు మామూలు నియోజక వర్గములలో వారి జనాభా సంఖ్య ననుసరించి కొన్ని స్థానములను మాత్రము ప్రత్యేకించుటకు నిర్ణయింపబడినది.

ఇట్లు ప్రత్యేక ప్రాతినిధ్యము కులముల ననుసరించి ఏర్పాటు చేయుట ప్రజాస్వామ్య సిద్ధాంతమునకు విరుద్ధమని ఇప్పటికి మన నాయకులు నిర్ణయించ కల్గిరి. ప్రజాస్వామ్య సిద్ధాంతము ప్రకారము ప్రతిపౌరునికి రాజ్యాంగ విషయములలో సమాన హక్కు లుండవలెను కాని, ఒక మతమునకు కాని, ఒక కులమునకు కాని, ఒక వర్గమునకు కాని చెందుట వలన ప్రత్యేక హక్కులు సంక్రమించుట కవకాశము లుండవు. దేశములోని ఇతర వర్గముల వారి కన్న ఆర్థికముగను, విద్యా విషయములలోను, ఇతర విషయములలోను చాల వెనుకబడి యున్న కొన్ని ప్రత్యేక జాతుల వారికి మాత్రము, తమ తోడి దేశస్థులతో సమాన మగు స్థితికి వారు వచ్చువరకు, శాసనసభ లలో వారికి కొన్ని స్థానములు ప్రత్యేకింప బడుట అవసరము వచ్చినది. ఇది ప్రజాస్వామ్య సిద్ధాంతమునకు వ్యతిరేకమని తలంప వీలులేదు. అయినప్పటికి చిరకాలము ప్రత్యేక నియోజకవర్గముల ననుభవించి వాటిద్వారా శాసనసభలకు ఎన్నుకోబడుచు వచ్చిన మహమ్మదీయులు, క్రిష్టియనులు, ఆంగ్లో ఇండియనులు, స్త్రీలు మొదలగువారికి క్రొత్త రాజ్యాంగచట్టము క్రింద ఏర్పడు పార్లమెంటులోను, రాష్ట్ర శాసనసభలలోను తగిన ప్రాతినిధ్యక్షేమముండునట్లు తగు ఏర్పాట్లు చేయవలసి యున్నది. త్వరలో నిర్ణయింపబడనున్న నియోజకవర్గముల ఏర్పాటులోను, ప్రతినిధుల ఎన్నికలకు నామినేషనులు చేయబడునప్పుడును, ఈ విధముగ సహాయకారులుగ నుండు విధానముల నాలోచించుట అవసరము.

చట్టముప్రకారము ప్రత్యేక నియోజకవర్గములు తొలగింపబడుటచే పైన చెప్పిన విధముగ అల్పసంఖ్యాకుల ప్రాతినిధ్యములో లోపము లుండకుండ చూచు బాధ్యత ఇప్పటి రాజకీయపక్షములపై, ముఖ్యముగ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మొదలగువాటిపై యున్నది. ఈ పార్టీలు ఎన్నికలలో తమ తమ అభ్యర్థులను నిర్ణయించు సమయములో మైనారిటీవర్గములకు చెందినవారిని నియామక చేసి వారు ఎన్నుకోబడునట్లు తగు ప్రయత్నములు చేయవలసియున్నది. కేవలము రాజకీయ విభేదములపైనను, సూత్రములపైనను రాజకీయపక్షము లేర్పడినప్పుడు, కుల, మత, వర్గ అభిమానములను విసర్జించి, పక్ష విధానములనుబట్టి మాత్రమే సభ్యులుఎన్నుకోబడుట, ఓడింపబడుట జరుగును. కాని అట్టిపరిస్థితులు మనదేశమం దేర్పడుటకు సుమారు పది, పదిహేను సంవత్సరములు పట్టును. ఈ మార్పు వచ్చే ఎన్నికలకు వచ్చునా యనునది అనుమానాస్పదమగుటచే పై విధముగ ప్రత్యేక ప్రయత్నములు చేయవలసిన అవసరము కల్గుచున్నది. భారతదేశమందు ఇకముందెప్పుడును కూడ మత, కుల సిద్ధాంతముల ననుసరించి ప్రాతినిధ్యము ప్రవేశపెట్టబడుట కవకాశములు

లేవని ప్రజాసామాన్యము గ్రహించిన పై సూచించిన మార్పు త్వరలోరాక తప్పదు.

రాబోవు ఎన్నికలలో వోటింగు ఏ పద్ధతులపై జరుపుట మంచిది యను విషయమునుగురించి దేశములో తీవ్రచర్చ జరుగుచున్నది. వివిధ శాసనసభలలో వివిధ వర్గములవారికి సరియగు ప్రాతినిధ్య ముండునట్లు చూచుట ముఖ్యముగాన ఇట్టి చర్చవలన దానికి సంబంధించిన విషయములు స్పష్టీకరింపబడును. నియోజక వర్గములను ఏ విధానము ననుసరించి ఏర్పాటు చేయవలెను? ఒక్కొక్క నియోజకవర్గమునుండి ఒక్క సభ్యుడు ఎన్నుకొనబడవలెనా. లేక నియోజక వర్గములు, 3. 4 సభ్యులను ఎన్నుకొనుటకు వీలుగా ఏర్పాటు చేయవలెనా? ఏ విధానము వలన మైనారిటీ పార్టీలకు తగు ప్రాతినిధ్యము కల్గును? ఈ సమస్యలు నిర్ణయింపబడవలసి యున్నది. ప్రతి నియోజకవర్గము ఒకే సభ్యుని ఎన్నుకొనుపద్ధతియే ప్రస్తుతపరిస్థితులలో అన్ని విధములా సౌకర్యమార్గమని చాలా మంది అభిప్రాయపడుచున్నారు. ఒకేవర్గము 3 లేక 4 సభ్యులను ఎన్నుకొనుటకు ఏర్పాటు చేయబడిన. ఇంతవరకు దేశమునకు లేని నష్టము వాటిల్లచేసినట్టి ప్రత్యేక ఎన్నికపద్ధతిని తిరిగి వేరొకవిధముగకాని, వెనుక గుమ్మము ద్వారాకాని ప్రవేశపెట్టుటయే యగును. అట్లు కాక ఒకే మెంబరును ఎన్నుకొను పద్ధతిలో మొత్తముమీద ఇతర అభ్యర్థు లందరికన్న హెచ్చుఓట్లు వచ్చినవారుకాక, అందరు అభ్యర్థులలో ఎక్కువ వోట్లు వచ్చినవారే ఎన్నుకోబడుట జరుగును. ఈ విధానములో ప్రజా బాహుళ్యముయొక్క అభిప్రాయము విశదీకరింపబడదనియు, జయముపొందిన అభ్యర్థికి వోటుచేసినవారి అభిప్రాయముమాత్రమే విశదీకరింపబడుననియు. అదిప్రజాస్వామ్యపద్ధతికి వ్యతిరేకమనియు, కొందరు వాదించుచున్నారు. పైన సూచింపబడిన రెండు పద్ధతులలోకూడ కొంతలాభము, కొంత నష్టముకూడ ఉన్నదని అంగీకరింపక తప్పదు. రెండు వాదనలలోను కొంతకొంత బలమున్నమాట నిజమే. అయినప్పటికిని, ముఖ్య రాజకీయపక్షములు, అల్పసంఖ్యాకులపట్ల తమ విధ్యుక్త ధర్మమును నిర్వహించుటకు పూనుకొనిన. అనగా వారికి చెందిన అభ్యర్థులకు ఎన్నికలలో జయము కలుగునట్లు చూచుటకు పూనుకొనిన, మొత్తముమీద ఒకేసభ్యుని ఎన్నుకొను నియోజకవర్గముచే లాభదాయకమమని చెప్పవలసియున్నది.

ఈ రెండు పద్ధతులును కాకుండా, 3 లేక 4 సభ్యులను ఎన్నుకొను నియోజకవర్గముల నేర్పాటుచేసి వోటర్లు వోటింగు హక్కును ఒకే సభ్యునికి వోటిచ్చునట్లు సంకుచితపర్చిన న్యాయముగ నుండునని కొందరు చెప్పుచున్నారు. అనగా. ఒక నియోజకవర్గము 3,4 సభ్యులను ఎన్నుకొనునటులు నిర్ణయించినప్పటికిని వోటింగు సమయములో ఒక అభ్యర్థికి మాత్రమే ఒక్కొక్కఓటరు ఓటుచేయుటకు వీలుండును. ప్రతి అల్పసంఖ్యాక వర్గమునకు చెందిన వోటరును ఈ విధానములో తనకు ఇష్టమున్న రాజకీయపక్ష అభ్యర్థికిమాత్రమే వోటుచేసి. ఆ అభ్యర్థికి జయముకలుగునటులు చేయుటకు అవకాశముండును. కేవలము రాజకీయపథకములపై మాత్రమే పక్షములు

పనిచేయునప్పుడు ఈ పద్ధతివలన లాభముండునుకాని, కేవలము కుల, మత, వ్యక్తిగత పద్ధతులపై వోటర్లు వోటుచేయుటకు సిద్ధముగా నున్నంతకాలము దానివలన కుల, మత కక్షలను స్థిరము చేయుటయే యగును.

వయోజన వోటింగుపద్ధతి, దానివలన ప్రతి పౌరునికి సంక్రమించు బాధ్యతలు మన దేశ ప్రజలకు పూర్తిగ అవగాహన యగువరకు అందరికును తేలికగ అర్థమగు వోటింగు పద్ధతినే ఎన్నికలు జరుపుట చాల అవసరము. అట్టిపద్ధతి ఒక్కొక్క నియోజకవర్గము ఒక్కొక్కసభ్యుని ఎన్నుకొనునదియే. దీనికి కూడ దేశములో ప్రచండప్రచారము చాల అవసరము. రాజకీయపక్షము లన్నియు ఇప్పటి నుండియు ప్రజలలో ఇట్టి ప్రచారమును కొనసాగించవలసి యున్నది. ఈమధ్య మద్రాస్‌లో జరిగిన సోషలిస్టు పార్టీ సమావేశములో ఇట్టి ప్రచారమును కొనసాగించుటకు నిర్ణయింపబడినది. అట్లే ఇతర పక్షములుకూడ ప్రజాదామాశ్యమునకు ఎన్నికల ప్రాముఖ్యత. వోటు యొక్క ప్రాముఖ్యత. వాని హక్కులను. బాధ్యతలను వారెటులు నిర్వహింపవలసినదీ, ఈ సమస్యకు సంబంధించిన ఇతర విషయములను గురించి ప్రచారముచేసి ప్రజలలో రాజకీయ సంచలనము పురికొల్పుటకు పూనుకొనవలెను. ఈ సందర్భములోనే వివిధపార్టీలు, తమతమ ఎన్నిక విధానములను ప్రజలకు తెల్పుటయు వాటిపై ప్రజాభిప్రాయమును పెంపొందించుటయు జరుగుట కవకాశము లున్నవి.

వచ్చే ఎన్నికలు "న్యాయమైనవి" గను "స్వేచ్ఛా"పద్ధతిపై జరుగునవిగను ఉండవలెనని జూన్ నెలలో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్‌కు వ్యతిరేకులగు వివిధపక్షముల సమావేశములో ఉద్ఘాటించబడినవి. అఖిలభారత సోషలిస్టు పార్టీ వారి విధానములో ఇది ఒక ముఖ్యాంశముగా నిర్ణయింపబడినది. ఎన్నికలు న్యాయమగు పద్ధతులపైనను, వివిధ పక్షముల అభ్యర్థుల కెట్టి ఆటంకములులేని పరిస్థితులలోను జరుగవలెనను విషయముపై భేదాభిప్రాయములు లేవనియే చెప్పవచ్చును. కాంగ్రెసుపక్షమువారు ఇతర పక్షములవారికి స్వేచ్ఛగ తమ ఎన్నికల ప్రచారము చేసుకొనుటకు అవకాశము లీయరనియు, ప్రభుత్వ అధికారములు ప్రస్తుతము కాంగ్రెస్‌పార్టీ వారిచేతులలో నుండుటచే వారి ఇష్టమువచ్చినటులు ఇతరపార్టీలను నిర్బంధింతురనియు, ఈ ప్రతిపక్ష సభ్యులలో కొంత భయమున్నటులు స్పష్టమగుచున్నది. అట్టి భయమునకు ఎట్టి తావులేదనియు. ఎన్నికలలో అన్ని పక్షములును తమ ప్రచారమును నిర్విచారముగ కొనసాగించుకొన వచ్చుననియు. ప్రభుత్వపక్షమునుండి అభయము అవసరముగ రావలసి యున్నది. ఏ పార్టీకాని హింసాయుత మార్గములను. దేశద్రోహముగ పరిగణించవలసి వచ్చు మార్గములను అవలంబించనంతవరకు, దానికి ఎన్నికలలో పాల్గొనుటకు ఎన్నికల సందర్భములో ప్రచారముచేయుటకు కాంగ్రెస్ పార్టీ కెంత స్వేచ్ఛయున్నదో అంత స్వేచ్ఛయుండుట అవసరము. ఎన్నికల కార్యకలాపమంతయు పార్లమెంటు. ఇండియన్ రిపబ్లిక్ అధ్యక్షుల అధికారముక్రింద జరుగుటకు రాజ్యాంగచట్టము ప్రకారము నిర్ణయింపబడియుండుటచే ఆ కార్యకలాప మంతయు నిర్దిష్టముగ జరుగుననియే తలంపవచ్చును.

# "పారవశ్యం"

"మహతి"

అన్నా తమ్ముళ్ళిద్దరూ శివభక్తి తత్పరులే. ఒంటినిండా విభూతిరేఖలూ, ముఖంలోదేదీప్యమానంగా ప్రకాశించే శివతేజస్సూ, మెళ్ళో మెరుస్తూ వ్రేలాడే లింగకాయా-భూమికి అవతరించిన సాంబమూర్తి స్వరూపులా అనిపించి ప్రజలందరూ ఆశ్చర్యపోయేవారు. వాళ్ళ కేశబంధనంలో ఉన్న పసిమిపచ్చని గన్నేరు పువ్వుసైతం శివతపస్సులో మైమరచి మహేశ పవిత్ర పాద సాన్నిధ్యంకోసం తహతహలాడుతూ జపిస్తోందా అనిపించేది.

అన్నగారు సర్వసంగ పరిత్యాగం చేసిన మహా శైవుడు. ఆయనకంఠంలోంచి వినవచ్చే "ఓం" కార దివ్యనాదం వింటేనే తరించిపోతామనే సంకల్పంతో గ్రామగ్రామాలనుంచీ శివభక్తు లెందరెందరో వచ్చి పాదాక్రాంతమయేవారు. అమోఘమయిన ఆశీర్వచనం కోసమూ. అనిర్వచనీయమయిన హృదయానుభూతికోసమూ శైవులు తండోపతండములుగా వచ్చేవారు.

భక్తి తత్పరతలోనూ, పవిత్రతలోనూ అన్నగారికేమీ తీసిపోడు తమ్ముడు. కాని, ఇహలోకవాంఛల్నీ. రసమయానందజీవితాన్ని కాదనలేడు. భక్తి పారవశ్యంతో, స్వర్గలోక ప్రాప్తికోసం ఎంతగా యిదవుతామో ఆనంద చిద్విలాసంతో ఇహలోకసౌఖ్యానుభవంకోసం కూడా అంతే యిదవాలి. మానవుడు!—అనే తమ్ముడిభావన అన్నకి సుతలామూ పనికిరాదు. అతని నిష్కామయోగానికీ, ఇతని సౌందర్యోపాసనకీ—నిజానికి చుక్కెదురే!

ఇక్కడే ఉంది అన్నదమ్ముల మధ్య భేదభావం. అణగనీయమైన భ్రాతృత్వం అవడం వల్ల ఈ భేదభావం వాళ్ళహృదయాల్లో ఏ మాత్రమూ తలయెత్తలేక పోయింది. విజృంభించా లేకపోయింది.

అన్నగారు సర్వసంగ పరిత్యాగే కాని, తమ్ముడు శివసాన్నిధ్యాన్ని చేరలేడేమో నన్న చింతని పోగొట్టుకొనలేకపోయాడు. దినదినమూ ఆయనమనస్సులో ఈ సంతాపం ప్రవర్ధమాన మౌతూనేవచ్చింది.

లింగాభిషేకంచేస్తూ "శివదేవా! నాతమ్ముణ్ణి కూడా ఇహలోకవాంఛలకీ, శారీరక సౌఖ్యాలకీ అతీతమైన పరమ పవిత్రయోగిగా చెయ్యవా? అమృతతుల్యమైన నీ వాత్సల్యాన్ని మాపై వర్షింపచెయ్యవా?" అంటూ అనుదినమూ సాష్టాంగపడేవాడు. పూజా నిర్లక్ష్యతవల్ల తన తమ్ము డెక్కడ దేవదేవుని ఆగ్రహానికి గురి అవుతాడేమోనని తమ్మునివంతు పూజాదికాలు

కూడా అన్నగారే చేసేవాడు. భారతీయుల భ్రాతృత్వం ఎంత ఉన్నతఅంతస్థులో ఉం టుందో గ్రహించడానికి ఇంతకంటె మంచి ఉదాహరణ యేంకావాలి?

మహాశివరాత్రి పర్వదినం సమీపించింది. "హరహర మహాదేవ! హరహర మహా శంకర!" అంటూ మహా శివాలయానికి గ్రామ గ్రామాలనుండీ మహాశైవులు బయలుదేరు తున్నారు. శివకైంకర్యానికి కావలసిన వస్తు సంభారాలతో అన్నదమ్ములిద్దరూ ప్రయాణో న్ముఖులై వెళ్ళారు.

* * *

సాయంకాలం అయింది.

సోదరులిద్దరూ నదిలో స్నానంచేస్తున్నారు.

తమ్ముడు సంధ్యావందన పూర్తిచేసి అర్ఘ్య సమర్పణంకూడా భక్తిశ్రద్ధలతో ఆచరించి కళ్ళుతెరిచాడు.

అతని ఆశ్చర్య సంభ్రమాలకి హద్దే లేక పోయింది.

తనకళ్ళనే నమ్మలేకపోయాడు.

సౌదామినిలాంటి ఆ సౌందర్యరేఖని చూడ గానే అతని రసహృదయం సమ్మోహనాంకి తం కాకుండా ఉండలేకపోయింది. ఆర్ద్ర వస్త్రాల్లోంచి ఉన్నతంగా కనిపిస్తోన్న ఆమె వక్షాలమధ్య మెరిసే స్వర్ణలింగం గోచరించిం దాతనికి. అతన్ని చూడగానే ఆ ముహూ ర్తంలో మహాశివుని రూపాన్నే అతనిలో కాంచగలిగిం దామె! తానే పార్వతినన్న భావంతోకూడా పొంగిపోయిందామె!

ఆక్షణంలో ఆ యిద్దరికళ్ళూ కాళిదాస మహాకవి కావ్యాలే అయిపోయాయి.

ఇద్దరూ నదిలోంచి గట్టెక్కి వెళ్ళి పోయారు. దారిలో కనుపించినవాళ్ళకి శివ పార్వతుల్ని తలపింపజేశారు మళ్ళీ.

ధ్యాననిమగ్నతలోంచి అన్నగారు కళ్ళు తెరిచేసరికి. తమ్ముణ్ణి కానక బెంబేలు పడి పోయారు. తమ్ముడు నదిలోంచి గట్టెక్కి వెళ్ళిపోయేడని నలుగురూ నిర్ధారణగా చెప్పిం తర్వాతే అతనిగుండె కుదుటపడింది.

తెల్లారితే శివరాత్రిదినం. తమ్ము డెప్పు డొస్తాడో అనే ఆందోళనతో అన్న గారు పూజాదికాలు ముగించుకోవడంకోసం బయ ల్దేరి వెళ్లిపోయాడు. ఆనదిలోని నీళ్లంత నిర్మలహృదయం అతనిది.

* * *

రాత్రి పూజాపునస్కారాలు పూర్తిచేసి పళ్లూ ఫలహారం నైవేద్యం పెట్టింది.

భక్తితో విభూతిపూసుకొని, పారవశ్యంతో శివలింగాన్ని స్పృశించి కళ్లకి అద్దుకున్నా డతను.

ఇద్దరూ ఫలహారాలు పూర్తి చేసింతర్వాత పూజామందిరంలోంచి శయన గృహంలోకి వచ్చేశారు.

అతని కేశాలను దిగజార్చి, సాంబ్రాణీ ధూపంతో తడినార్చి, శిఖకూర్చి, చక్కని బంధనంవేసింది. శివపాదాంకితమైన పచ్చ గన్నేరుపువ్వుని శిఖమీద పెట్టింది ప్రేమాంకితంగా.

పన్నీరు చిలికి పరవశుణ్ణే చేసింది.

ఆమె చూపులోని లాలిత్యమూ, హృదయ నైర్మల్యమూ అతణ్ణి ఆనందడోలికల్లో ఊపేశాయి: గిలిగింతలే పెట్టేశాయి.

పరిమళమైన కస్తూరితో శివలింగాన్నే అతని నెన్నొసటిమీద తిలకంగా దిద్దింది.

శివలీలల్ని మధురంగా గానంచేసిన ఆమె కంఠమాధుర్యానికి,—హర్షించి చుబుకాన్ని ముద్దాడి అక్కున జేర్చుకున్నాడు.

శివుణ్ణి-అన్నయ్యనీ అన్నిటినీ మరచిపోయి ఆనంద పారవశ్యంలో ఏకాగ్రతని అందుకొని ఆమెతోనే ఏక శయ్యాగతుడైపోయాడు.

* * *

వేగుజుక్క పొడిచింది.

"కొక్కొరో కో" అంటూ కోడికూసింది.

చల్లగాలి తిరగడంతోనే తమ్ముడికి మెలకువ వచ్చేసింది.

లింగోద్భవకాలం అయిందని తెలుసుకోగానే భక్తిపారవశ్యుడైపోయాడు. ఆనందోద్రిక్తుడే అయిపోయాడు. తన కుడిచెయ్యి శివలింగంమీదనే ఉన్నట్టనిపించేసిం దతనికి. పారవశ్యతతో ఆచెయ్యిని అలానేఉంచి, లేచి కూర్చొని, ప్రక్కనున్న రాగి పంచపాత్రని ఎడంచేత్తో అందుకొని—పవిత్రతతోను, భక్తిశ్రద్ధలతోను లింగాభిషేకం చేసేశాడు. రెండు చేతుల్నీ ఎత్తి పూజ్యభావంతో నమస్కారం చేశాడు.

ఆమె ఆశ్చర్యపోయింది. పవిత్రమైపోయానని పట్టలేని ఆనందంతో ఉద్రూతలూగిపోయింది. అతని భక్తితత్పరతకీ, ఏకాగ్రతకీ ఎంతో యిదైపోయింది.

ధ్యాననిమగ్నతలోంచి కళ్లుతెరిచా డతను. అప్పటికే ఉషోదయం అయింది.

కళ్లు తెరిచీ తెరవగానే, పాలరాయిలానిగనిగలాడుతూన్న ఆమె కుడిస్తనము,—తానభిషేకించిన జలము కనిపించాయి అతనికి.

అంతేకాదు-ఆ సౌదామిని చిలిపి నవ్వులు కూడా వినిపించాయి.

ఆమె నవ్వులో తన నవ్వునుకూడా మిళితం చేసి శివలింగంగా భావించి తా నభిషేకంచేసి—పునీతంగావించిన ఆ సుకుమార సుందర సురుచిర స్తనాన్ని ముద్దు పెట్టుకున్నాడతను.

శివాలయంలోంచి గణగణమంటూ గంటలు శ్రావ్యంగా మ్రోగాయి."హరహర మహాదేవ! శంభోశంకర" అన్న ప్రార్థనాపూర్వక మంగళ నినాదాలు మిన్నుముట్టాయి.

* * *

లింగోద్భవకాలంలో నయినా తమ్ముడు రాలేదన్న ఆందోళన అన్నగారి హృదయంలో ఎక్కువైపోయింది. లింగాభిషేకం చేస్తూన్నాదన్నమాటేగాని దృష్టిఅంతా తమ్ముడిమీదే ఉండిపోయింది.

అతనికి ఏకాగ్రతా కుదరలేదు; భక్తి పారవశ్యతా రాలేదు.

తెల్లవారింది! సూర్యోదయంకూడా అయిపోయింది. అయినా తమ్ముడు రాలేదు.

ఆ అన్నకి తమ్ముడంటే ఎంతప్రేమ! ఎంత వాత్సల్యం

# చీమల సాంఘిక జీవనం

శ్రీ రాళ్ళపల్లి ఫణిశాయిశర్మ

చీమలు మానవులవలె సంఘజీవులు. సాంఘిక జీవితానికి అత్యవసరమైన జాతిప్రభేదాలు కార్యవిభజన, స్వజనాభిమానం - మొదలగు గుణము లన్నిటినీ మనము చీమలలో చూడవచ్చును. ప్రతిచీమ ఏదో ఒక పుట్టకు చెందియుంటుంది. అంటే ప్రతి వల్మీకం ఒక సంఘమన్నమాట. ఆ సంఘంలో తనకు నిర్దిష్టమైన పనిని యథాశక్తి చేయడానికి ప్రయత్నిస్తుంది. ఏ చీమగాని ఒంటరిగా బతుకలేదు. జీవి ప్రపంచంలో సంఘమే శక్తి అని తెలుసుకొన్న వానిలో మొదటిస్థానం చీమలకు ఇవ్వక తప్పదు.

స్థూలముగా మనకు చీమలలో మూడు జాతులు కానవస్తాయి—స్త్రీలు, పురుషులు, నపుంసకులు. నపుంసకులలోనే ఇంక రెండు విధాలు కలవు—సైనికులు, కార్మికులు. ప్రతి జాతికి ఒక విశిష్టమైన దేహకట్టకలదు. దీనిని అనుసరించే చీమలు వేరువేరు జాతులుగా వింగడింపబడినాయి. స్త్రీ పురుషులకు మాత్రం రెక్కలుగలవు. నపుంసకుల కుండవు. నపుంసకులకున్నంత పెద్ద శిరస్సు స్త్రీ పురుషుల కుండవు. నపుంసకులలో సైనికులు పెద్ద ఆకారముకలిగి గండ్ర గొడ్డలివంటి చిబుకములు కలిగివుంటాయి. కార్మికులు సామాన్యమైన ఆకారము కలిగివుంటాయి.

ఇటువంటి దైహిక వ్యత్యాసముల ననుసరించి అవి చేయు పనులుకూడ వేరువేరుగా వుంటాయి. పురుషునికి వంశోద్ధారము చేయుటలో రాణికి (స్త్రీ రాణి అనబడుతూంది) తోడ్పడుటతప్ప వేరేమీ పనిలేదు. రాణి నిరంతరంగా పిల్లల్ని కంటుంది. అంతే. కార్మికులు గింజలు సేకరిస్తాయి. పిల్లల్ని చూసుకుంటాయి. మరి వల్మీకాన్ని నిర్మిస్తాయి. సైనికుల పని గృహ సంరక్షణ. ఇట్లు ప్రతిజాతికీ ఒక నిర్దిష్టమైన పని వుంటుంది. ప్రతిజాతీ తనకు నిర్దిష్టమైనపనిని చేయడంవల్ల చీమలసంఘంలో కార్యవిభజన సాధ్యమవుతుంది.

కాని మానవసంఘంలో కార్యవిభజనకూ, చీమలసంఘంలోని కార్యవిభజనకూ ఒక ముఖ్యమైన వ్యత్యాసం కానవస్తుంది. మానవ సంఘంలో ప్రతిమనిషీ తాను చేయవలసిన పనిని తన ఇష్టప్రకారం ఏరుకోగలడు. తాను పెట్టిన అంగడి దివాలాతీస్తే దుకాణాదారు భిక్షం ఎత్తగలడు, లేక ఇంకేపనైనా చేయగలడు. చీమలు అట్లు కాదు. పరమాత్మునిలో నిర్దిష్టమైన ఒక్క కార్యంతప్ప వేరేమి అవి చేయలేవు. కార్మికుల పని సైనికులు చేయలేరు. సైనికుల పని కార్మికులు చేయలేరు. ఈ రెంటిని స్త్రీ పురుషులు చేయలేరు. చీమలకు కొన్ని ప్రకృతిసిద్ధమైన, ఆ జాతిలో సర్వజన

సామాన్యమైన గుణాలు వుంటాయి. వీటినే "సహజ ప్రవృత్తి"లంటారు. ఈ గుణాలు నైజములు కాబట్టి కొత్తగా నేర్చుకోవలసిన అవసరం లేకుండానే చీమలు వాటికి అనుగుణమైన కార్యములను జన్మాదారభ్య చేయగలుగుతాయి.

జాతిప్రభేదాలను గురించి మరొక మాట. నపుంసకులు అని పిలువడంవల్ల అవి స్త్రీ పురుషులు కాక మూడవ లింగానికి చెందినవనుకోవడం పొరబాటు. వంధ్యములైన స్త్రీలనే నపుంసకులంటారు. ఆ వంధ్యములైన స్త్రీలు రాణులనబడుతాయి. రాణులకూ నపుంసకులకూ ఉన్న వ్యత్యాసం అవి సేవించు ఆహారము మీద ఆధారపడివుంటుంది. బలిష్టమైన ఆహారసేవనంతో స్త్రీలు రాణులవుతాయి. బలహీనమైన ఆహారసేవనంతో అవి నపుంసకులవుతాయి. కార్మికులకు సైనికులకు గల వ్యత్యాసం కూడ ఇట్లనే ఆహారవ్యత్యాసంతో కలుగుతుంది. అయినా ఒక్క విశేషమేమంటే రాణికీ నపుంసకులకు గల వ్యత్యాసం ఆహారముయొక్క గుణాన్ని అనుసరించి వుంటుంది. కార్మికులకు సైనికులకు గల వ్యత్యాసమన్ననో ఆహారముయొక్క పరిమాణాన్ని (క్వాన్‌టటీ)అనుసరించి వుంటుంది.

చీమలకు ఒక విధమైన స్వజనాభిమానం కూడ కలదు. ఏ పుట్టలోనికైనా దానికి చెందినవాళ్లకే ప్రవేశం కలదు. పరాయివాళ్లకు ఏ మాత్రం ప్రవేశం లేదు. చీమలు ఆత్మీయులను తమ ఘ్రాణ శక్తివల్ల కనుక్కోగలుతాయి. ప్రతి పుట్టకు ఒక విశిష్టమైన వాసనవుంటుంది. ఆ పుట్టయందు చిరకాలం వసించడంవల్ల దానికి చెందిన చీమలకు మాత్రం ఆ వాసన వుంటుంది; పరాయివాళ్లకుండదు. చీమలు తమ పుట్టలోనికి ఇటువంటివాసనగల చీమలకు మాత్రం ప్రవేశమిస్తాయి. ఇతరులను బైటికి గెంటివేస్తాయి.

ఈ వాసన తప్ప ఆత్మీయులను తెలిసికొనుటకు వేరు ఆధారము లేదు కాబట్టి అకస్మాత్తుగా దానిని సంపాదించిన పరాయివాండ్లను చీమలు ఆత్మీయులుగానే తలుస్తాయి; అట్లే దానిని పోగొట్టుకొన్న ఆత్మీయులను పరాయివాండ్లని తలచి బైటికి గెంటివేస్తాయి.

కార్య విభజన వలెనే చీమలు తాము సంపాదించిన ఆహారాన్ని కూడ పంచుకొంటాయి. తాము ఆర్జించిన ఆహారాన్ని చీమలు గొంతుకు దగ్గరగా వున్న ఒక కోశంలో చేర్చి వుంచుతాయి. ఇట్లు సంచితమైన ఆహారాన్ని అనుభవించుటకు అదొక్క చీమకే కాదు ఆ సంఘానికి చెందిన ప్రతి చీమకూ హక్కు వుంది. అందుకనే ఆ కోశాన్ని "సంఘోదరం" అన్నారు. ఏ చీమకయినా ఆహారం కొత్తిగా దొరకకపోతే ఇతర్లను యాచిస్తుంది. అప్పుడు ఆహారాన్ని సేకరించి వుంచిన ఏ చీమ అయినా దానికి కొంత భాగం దానం చేస్తుంది.

జీవుల వికాస వృక్షంలో ప్రథమంలో వున్న చీమలలో ఇంత బాగ అభివృద్ధి పొందిన సాంఘిక జీవితం వుందంటే ఎవరికయినా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. దీనిని సృష్టివైచిత్ర్యం అనడంతప్ప మరేమీ చేయలేము కదా!

# భావ కవిత్వము: నవీనయుగము

శ్రీమతి : వి. సరోజినీదేవి, బి. ఎ.

సమకాలమువారి మెప్పులకు నోచుకొను కృతు లేకాలమందును చాల అరుదు. సమకాలపువారిని తెగడుట వలెనే పొగడుటకూడ పరిగణింపదగినది కాదు. కవి కేవలము తన యనుభవములనే చెప్పడు. స్వర్గసౌందర్యము, నరకబాధనుగూడ నాతడు భావనచేసి, కవితాసమాధియందు దాను పొందిన యనుభవానందమును తిరిగి కవనముఖమున నభివ్యక్తపరచును. కవితా సమాధిలోనున్న కవి మానవమాత్రుడు కాడు. సుఖ దుఃఖములను రెంటిని నాతడానందముతో దిలకించును. మనకు గామక్రోధములుగ గోచరించెడి విషయములే ఆతనికి శృంగార వీరములుగా సాక్షాత్కరించును. మనకు భయహేతువులగునవి కవియొక్క దివ్యచిత్తమున సంస్కారముపొంది ఆనందముగా తిరిగి సాక్షాత్కరించును. కవి దేశ కాలముల కతీతుడు. భూతముతో వర్తమానమును సమన్వయించి, భవిష్యత్కాల ప్రవాహముతో సంగమింపచేసినవారే మహాకవులు.

నవ్యకవుల రచనలకును, ప్రాచీన కవుల రచనలకును కవిసమయములందు, నూతన పదజాల సృష్టియందు, ఛందోవిధానములందును చాల భేదములున్నవి. ఆంగ్ల, హిందీ సాహిత్యములతోడి పరిచయ మీ నవ్యకవుల రచనలకొక క్రొత్తదనము తెచ్చిపెట్టినవి. వీరి రచనలనే నవీనులు భావ కవిత్వమనియు, వేళాకోళముగా బావ కవితలనియు పేరు లిడుచున్నారు. ప్రాచీనులుకూడా వారియెడ సహృదయ భావములేక వారి రచనా విధానమును తెగనాడుదురు. ఉత్సాధు పరిభాషములతో నవ్యకవులును ప్రాచీనుల నపహసించెదరు. కాని కాళిదాస మహాకవి యన్నట్లు ప్రాతయైనంత మాత్రమున కావ్యము మంచిదియుకాదు; క్రొత్తయైనంతమాత్రమున చెడ్డదియు కాదు. ఉత్తమ పఠితలు గుణపరీక్షచేసి రసవత్కావ్యమును గ్రహించెదరు.

పలువు రాధునికకవుల రచనలు పంకలితముచేసి వ్రాయబడిన "వైతాళికులు"

అను గ్రంథమునుండియు, ఉత్తమ భావ కవిత్వమున కాదర్శప్రాయులైన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "కృష్ణపక్షము" నుండియు, అల్పాయుష్కుడయ్యెను కాని బ్రతికియున్నచో "తెలుగు కావ్య సరస్వతి నూపురంబు మ్రోయుదినములు మనకు చూపియుండు" శ్రీ రొడ్డాలి సుబ్బారావుగారి "హంపీ క్షేత్రము" నుండియు, నవ్యకవుల రచనా విధాన ములను గొన్నింటిని మనము తెలిసి కొనగలము. ఆంగ్ల సాహిత్యముతోడి సంపర్కమువలన, మన ప్రాచీన గ్రంథ ములం దెచ్చటను కానరాని "శీతాస్త్రులు, నీరవ గళమున జనించు కోరికలు, జవ్వ నపు నీడలు, ఇరుల గుసగుసలు, ప్రొద్దు పొడుపు రేకుల నైపెడిదారులు, తుషారపు స్వప్నరాసులు, తడిగట్టెడి సిగ్గులు, సిగ్గు గీతములు, విరహవీణలు, నీలమేఘ నిశ్వాసములు, మూగబాధలు, జీవన గంగాహరిత తటములు, సౌఖ్యజ్వాలలు" మున్నగు పదములు వీరు వాడుచున్నారు.

నవీన యుగమున ప్రపంచమున చెల రేగిన యశాంతి నిరాశలు సిద్ధినొందని మనోరథములు, పండని వలపులు నవ్యకవుల హృదయములను కలంచి వేయుటచే వీరు విషాద గీతములను బాడుకొనుచు జీవితపు ఎడారులయందు త్రోవతప్పిన పాంథులవలె పరితపించు చున్నారు. వీరి రచనలయం దెచ్చట చూచినను విరహ విషాదగంధము పరిమ ళించుచుండును. అందుచే వీరి రచన లందు కృష్ణశాస్త్రిగా రనినట్లు:

"ఎద్దియొ అపూర్వ మధురరక్తి స్ఫురించుకాని
అర్థమ్ముకాని భావగీతమ్ములవి"

విప్రయోగమునందే రససిద్ధిని బడయ జూచెదరు.

"దానితోసరి, మరల నాంధ్యమ్ముగ్రమ్మె
తొలి చిరునేని యీ చీకటులును, నేను
ఒక్కరొక్క రప్పళించుకొంచుండినాము,
నిన్ను, నీనాటి మెఱుపు మన్నించుకొంచు"

దుఃఖావేశముచే వారికి జీవితము పీడ కలవంటి దైనది.

"రేయి కడుపున జీకటిచాయవోలె,
తమస్సు ఎడద దివాంధగీతము విధాన
ఘూకరావాస వలవంతరేకరీతి
నా విషాదమ్ములో దాగినాడ నేనె"

అస్ఫుటమగు వాచ్యముచే ననూహ్య మగు వ్యంగమును సాధింపగోరు రచన ములవలననే వీరి కవిత్వ మర్థమగుట లేదని చాలమంది యూహించుచున్నారు.

స్వాతంత్ర భారతరంగమున పొంగి పొరల నవ్యకవుల నూతనావేశములతో జయగీతములు, మాతృగీతములుపాడుచు భవిష్యత్కాల గర్భకుహరముం జొచ్చి, స్ఫటికపాత్రమున శాంత్యాసవముం ధర్మ దేవతచే దెప్పించి జనులను సంతుష్టులం జేయుచున్నారు.

కిన్నెర

సంస్కృతపు పోకడలలోమాత్రము మన కవులది తక్కువచేయియా?

“వాగర్థంబులలో ప్రమాణములలో,
వాదంబులో, సూత్రచర్చాగాంభీర్యములో
కవిత్వమధు ధారావేగ విభ్రాంతిలో
బాగోయీ కవిరాజ !”

పంపాసరస్సు కొండచరియలయందు ప్రేమ మేఘప్రవాహాల నేలుకొనునట.

“ఆడుచున్నది రెక్కలార్చి గరుత్మతి
తెలుగు జెండా కర్ర తీసిరేల”

ఈ ఆవేశము, తన్మయత్వము, సామాన్యకవులకు అందునవికావు.

“అవమానమేలరా, అనుమానమేల
భరతపుత్రుడనంచు భక్తితో పలుక”

అని హెచ్చరించి, సంకుచితమగు నాంధ్రత్వమునుండి ఉదారమగు భారతీయతకు దారి చూపుచున్నారు.

“మాతృదేశ సేవాచింతామృత సం
దనువులర్పణచేసినవారి పార్థివశ్రీ
చెలువారు చోట తదసృగ్రుచులన్ వికసించి,
వాసనల్ వీచుచు రాలిపోవగవలెన్
తదుదాత్త సమాధి మృతికన్”

అని జీవిత కుసుమముల నివేదింప నాకాంక్షించుచున్నారు.

వీరు స్త్రీని భోగ్యపదార్థముగా కాక ఉపాస్యదేవతగా నారాధింతురు. వీరు భోగించునది ప్రకృతియందు దాగియున్న అంతః సౌందర్యమేకాని బాహ్యారూపము కాదు. ప్రకృతిని ప్రియురాలిగ భావించి

“ఆమె నవనీత హృదయ. నాయంతరంగ
శాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము ప్రేమజీవన విభాత
కైశికీగీతి, నా తపః కల్పవల్లి.
ఆమె జగదీశమకుటాగ్రసీమనుండి
యుర్విపై జారిన సుధామయూఖరేఖ....
ఆమె నా జన్మజన్మ పుణ్యములు పండి
ప్రాప్తమైన కేళీపరిత్యాగలీల.
ఆమె పదసన్నిధాన దివ్యస్థలాన
భక్తినమ్రుడనై నిలంబడినయపుడు
తలంపునకు వచ్చు నా పేదతనము నాకు!”

అని ప్రియి నాశ్వాసింతురు. నామ రూపాదులు లేని యీ స్త్రీవ్యక్తియే నేటి యాంధ్ర సారస్వతి పూజా పీఠ మలంకరించియున్నది.

“ప్రొద్దు పొడుపు నోముల నోచుచు, చిన్నెనెనపు సింగారింపు చెయిది సిరుల పడుచువాండ్రను వలచి వలపించు తెలుగుకన్నెల మోహనాకృతిని” మనకు సాక్షాత్కరింపజేయుచున్నా రీకవులు. స్త్రీ మూర్తిని నారాధించునపుడు రూప వర్ణన, నామ కథనమును వీరుచేయరు. “నేను” “ఆమె” అను సర్వనామములు ప్రయోగింతురు. బహుశా షెల్లీ కవి శేఖరుని ప్రేమగీతములు వీనికి మార్గదర్శకములు కాబోలు! సామాన్య

జనుల జీవిత మాధుర్యమును అలతి పొలతి తీయని నుడులతో మిక్కిలి సున్నితముగ నండూరి, అడవి, కవి కొండల గానము చేసినారు.

"స్వేచ్ఛా గానము"ను ఖండకావ్యమున శ్రీ కృష్ణశాస్త్రిగారు తమ స్వతంత్ర భావముల నన్నింటిని "దాస్యశృంఖలములు చెదిరిపోవ కంఠమెత్తి స్వేచ్ఛా గానఝురుల" నించినారు. ఇతను కొన్ని వేళల భావోన్మత్తుడు; కొన్ని వేళల ప్రకృతి తన్మయుడు.

"ఆకులో ఆకును పూవులో పూవును
గలగలని వీచు జిఱుగాలిలో కెరటము
జలజలనిపాఱు సెలపాటలో తేటయు"

అయి యుండుట ఈతనికి మిక్కిలి ప్రియము. దుఃఖమును వర్ణించుపట్టము లం దీతడు అద్వితీయుడు. హాస్యమున సుఖాభిలాషకన్న దుఃఖాభిలాషయే ప్రియముగా నున్నట్లు గోచరించుచున్నవి.

"అమల మోహన సంగీతమందు
హృదయ దళన దారుణ రోదన ధ్వనులు
ఈకవికి వినిపించుచుండును.

"స్వచ్ఛమైనట్టి ప్రణయంపుసలిలధార
బోసి పెంచిన స్నేహంపు బూలతీవ
తావులను జిమ్మనలరుల దాల్పకుండ
గాలి తాకున నేలపై వ్రాలెనకట!"

తుద కీదుఃఖము ఒక వింత భోగముగా పరిణమించి లోకమును తిరస్కార భావముతోచూసి

"నన్ను గని యేరు జాలి చెందంగవలదు
ఎవ్వరని ఎంతురో నన్ను? ఏ ననంత
శోకభీకర తిమిర లోకైకపతిని
కంటక కిరీట ధారినై ....
నాకు నిశ్వాస తాళవృంతాలు కలవు
నాకు కన్నీటి సరుల దొంతరలు కలవు"

దుఃఖము లోతెరింగిన యీతని హృదయమున ప్రేమయంకురించి దుఃఖోపశాంతి గావించినది.

"సౌరభము లేలచిమ్ము పుష్పవ్రజమ్ము?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబుపాఱు? గాడ్పేల విసరు?
ఏల నాహృదయంబుప్రేమించును నిన్ను?"

మరియు

"ఎద జనిన మనోహరి జాడలరసి
కలగు హృదయంబు, నెమ్మది చలనమొందు
కనులు మూసిన, లోక మోహన మనోజ్ఞ
మూర్తి
చిరునవ్వుఁ జిలుకుచు మ్రోలనిలచు"

స్వాతంత్ర్య బుద్ధితో లోకమున సంచరించి దుఃఖముపాలై తుదకు ప్రేమతో కూడ తృప్తి పొందజాలని హృదయముల కింకొక్కటియే శరణ్యము. అది భక్తిమార్గము.

"కలుష దుర్దాంత పంక సంకలిత కుహరముల జనించు మదీయాశు మలిన ధార
స్వామి, భవదీయ పాదదేశమున బాఱి
పరమపావన జాహ్నవీ ప్రతిభగాంచు!"

సంపూర్ణముగ ఈ భక్తిమార్గము నవలంబించునపుడే కృష్ణశాస్త్రిగారి "కృష్ణపక్షము" శుక్లపక్షమై ప్రపంచమునకు వెల్లుబాటలు చూపునేమో! కాలక్రమమున ఇట్టి గ్రంథములే సారస్వత పూజాపీఠ మలంకరించి ఖ్యాతిగాంచునేమో!

# లీగల్ అడ్వైస్

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

"దివాంజీ వేంకటప్పయ్య పంతుల్ని తీసి వేశా" మన్నారు రాయణింగారు. దివాణంలో అతను మొదట చిన్నగుమాస్తాగా ప్రవేశించాడని వినికి. క్రమాంతరాలమీద అతను దివాంజీ అయిపోడమున్నూ రాయణిం గారికి వినికిడే.

అసలు, వేంకటప్పయ్య కళ్లయెదటే పుట్టారు రాయణింగారు.

రాయణింగారి పెరుగుదలా చదువు సంధ్యలూ వెంకటప్పయ్య చేతిమీదుగానే జరిగాయి.

మహారాజు అకాలమరణం వాతపడడంపల్ల, రాయణింగారి వివాహమూ, పట్టాభిషేకమూ కూడా, మహారాణికి కొన్ని చెప్పీ కొన్ని చెప్పకా, మరివొకరి ప్రమేయం సుతరామూ లేకుండా, తన యిష్టానుసారం వెంకటప్పయ్యే జరిగించేశాడు.

ఇటు పట్టాభిషేకం అయింది, అటు రాజ కార్యా లన్నీ స్వయంగా రాయణింగారే నిర్వ హించుకోసాగారు.

అయితే, చెలామణీ మాత్రం వెంక టప్పయ్య మాటలే.

వెంకటప్పయ్య అంటేనే జనులకు గడగడ.

ఈస్థితిలో అన్నారు, రాయణింగారు అతణ్ణి తీసివేశా మని.

వెంకటప్పయ్య నగుమొగంతోనే యింటికి వెళ్లిపోయాడు.

ఊరంతా మాత్రం రిచ్చపడిపోయింది.

దివాణం అంతా చకితమున్నూ అయిపో యింది.

గ్రామాలలో ఆశ్చర్యసంభ్రమాలు అల్లుకు పోయాయి.

"రాయణింగారు కృతఘ్నులు" అనుకున్నారు కొందరు.

"వెంకటప్పయ్య రాజద్రోహి" అని చెప్పే వేశారు చాలామంది.

మొదటమొదట వెంకటప్పయ్యతో కలిసీ, తరవాత్తరవాత అతని చేతికిందా, పనిచేసిన ముసలిగుమాస్తా అప్పలనరసయ్య, "వెంక టప్పయ్య ఆస్తి పదిలక్షల పైచిలుకు" అని సోపపత్తికంగా నిరూపించాడు.

వెంకటప్పయ్యకి పర్సనల్ గుమాస్తాగా పని



కి నెంరు

చేస్తూ, అతని పతనంతో అమాంశంగా "దివాం జీవా'' రయిపోయిన రామసుబ్బయ్య "వెంకటప్పయ్య హయాములో బొక్కసం నిలవ యెప్పుడు చూసినా పందలలోనే వుంటూ వచ్చింది'' అని లెక్కలతో చూపించాడు.

రాజకుటుంబం చిన్నది. రాయణింగారు బహుపొదుపరులు. ఆదాయమా, మూడులక్షల పైని. ఇది తెలిసినవారు, వెంకటప్పయ్య ధైర్య సాహసాలకు గుండెలు కొట్టుకున్నారు.

## 2

"రైతయినవా కొక్కడయినా మన యెదుటికి రాడేమి?'' అని సందేహం పట్టుకుంది రాయణింగారికి.

'వెంకటప్పయ్య పంతులుగారు వాళ్లని కాళ్లతో రాసేశారు.'' దివాణం ధరిమానాకు వస్తే మూడ్చేస్తా'' నని హుంకారమున్నూ చేశారు. అంచేత. వాళ్లు, అప్పుడు ఏలినవారి కంట పడలేకపోయారు. నేను వచ్చాక ఆపద్ధతి అంతా మార్చేశాను. ఏలినవారికి విన్నవించుకోవలసిన చిక్కులే లేవు వాళ్లకి. అంచేత యిప్పుడున్నూ వాళ్లు తమకంటపడడంలేదు మహాప్రభూ'' అంటూ సద్దిచెప్పాడు రామసుబ్బయ్య.

రాయణింగారు నమ్మలేకపోయారు.

"వెంకటప్పయ్య చేతికింద మసిలినవాడు రామసుబ్బయ్య. జిత్తులు బాగా నేర్చివుంటాడు'' అనుకుంది రాయణింగారి బుద్ధి.

ఆలోచనలో పడ్డా రాయన.

రాయణింగారిని గురించి "కుర్రకుంక'' అనుకుంది రామసుబ్బయ్య బుద్ధి.

తన ప్రతిభ కళ్లెం సడలించా డతను.

సరిగా, ఈ క్షణంలోనే "దివాంజీపదవి దొరకా లంటే యిదే జాగ్రత్తపడవలసిన ఘట్టం'' అనుకుంది రామసుబ్బయ్య పర్సనలు చెంచువున్న య్యా బుద్ధి.

నిద్రాహారాలు మరిచిపోయా డతను.

సంవత్సరం తిరిగింది.

''ఇనస్పెక్టి పరిశీలించండి మహాప్రభూ'' అని విన్నవించుకుని, చిట్టా రాయణింగారి యెదట వుంచాడు రామసుబ్బయ్య.

చూడగా. చిట్టానిలవా సంచినిలవా సరిగా సరిపోయివున్నాయి.

ఎప్పుడూ పందలకు మించి యెరగని బొక్కసం లక్షరూపాయల పైచిలుకుతో మిలమిలా మెరుస్తోంది

"చూసుకోండి నా స్వామిభక్తి'' అన్నట్టు రామసుబ్బయ్య కళ్లున్నూ మెరిశాయి; కాని రాయణింగారు సంతోషం క న ప ర చ లే క పోయారు.

"అదంతా తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం'' అనుకున్నాడు రామసుబ్బయ్య; కాని వొకనాడు, ఆఫీసుకి అప్పుడేవచ్చి పాగా తీసి బేబిలు మీద పెడుతూ వుండగా "ప్రభువు, ఫలానా ఫలానా— నలుగురు గుమాస్తాలను తరుచు సన్నిధికి పిలిపించుకుంటున్నా'' రని చూచాయగా తెలిసింది.

దానిమీద, పెద్దకాసా బైరన్న తరుచు తమ వీధికి వచ్చి యెడంయెడంగా తచ్చాడుతున్నా డనీ, ఒకనాడు, మధ్యాహ్నం జీతాల గుమాస్తా భార్య తన యింటికి వచ్చి "అన్నంచాలక మాడి పోతున్నాం, పంతులుగారితో చెప్పి మీరు కటాక్షించాలి'' అని ప్రాధేయపడుతూ, అపూట ప్రతీపనిలోనూ తన భార్యకు సాయం చేస్తూ యిల్లంతా కూడాకూడా తిరిగిం దనీ, వినివుండిన మాట జ్ఞాపకం వచ్చిం దతనికి.

తన చర్య అంతా తన పర్సనల్ గుమాస్తా వోరకంట చూస్తూనే వున్నట్టున్నూ హఠాత్తుగా సందేహం కలిగిం దతనికి.

కుర్చీకి చేరబడిపోయాడు, వెంటనే.

ఆవేళ ఆఫీసులో వున్నంతసేపూ పని మానేసి అత నాలోచనతోనే కాలం గడిపాడు మొత్తానికి.

సంతకాలకోసం వచ్చిన ప్రతిగుమాస్తానీ "రేపు చూద్దాం'' అని వెంటవెంటనే పంపేస్తూనూ వచ్చా డతను.

అంతే.

సాయంత్రం యింటికి బయలుదేరుతూ టేబిలుమీది పాగా అందుకునే సమయాన, వొక గుమాస్తా వచ్చి "విన్ను కొలువులో నుంచి తీసివేశాం'' అన్న కాగితం చేతబట్టి, పెదవులు విరుచుకుంటూ కళ్లు చికిలించుకుని వెళ్లిపోయాడు.

ఉత్తరక్షణంలో దివాంజీదర్జాతో వచ్చి, వెంచుపున్నయ్యా టేబిలు అంచున కూచుని తాళాలకోసం చెయ్యిచాపాడు, చురుగ్గా చూస్తూ.

ఉసూరుమంటూ బయలుదేరాడు రామసుబ్బయ్య.

"నన్ను ముట్టుకోకు నామాలకాకీ'' అన్నట్టు చూస్తూ పక్కపక్కకి తప్పుకున్నాడు బిళ్లబంట్రోతు.

"పౌర్ణమినాడు ఇటు చంద్రోదయమూ అటు సూర్యాస్తమయమూ వొక్కమాటే'' అన్నా డొక గుమాస్తా, అటుచూస్తూ.

"ఆపోశిక బాగా లేదు. రామసుబ్బయ్యగారి బొళ్లపెట్టి లక్షరూపాయలతో నిండాకే దివాణం బొక్కసంలో లక్షరూపాయల చేరిక'' అన్నాడు మరొక గుమాస్తా, కనుబొమ లెగరవేసుకుంటూ.

## 3

"జాగ్రత్త'' అని హెచ్చరించి, స్వయంగా దివాంజీకుర్చీలో కూచోపెట్టారు వెంచుపున్నయ్యని, రాయణింగారు.

"చిత్తం చిత్తం, చూస్తూనే వున్నాను మహాప్రభూ'' అని వంగి విన్నవించుకుని, రాయణింగా రలా వెళ్ళిపోగానే యిలా వెన్ను విరుచుకున్నాడు వెంచుపున్నయ్య.

గుమాస్తాలందరూ చుట్టూ చేరి, చిరకాలంగా అనుభవంలో వుండిన "నువ్వు'' అన్న మాట రాకుండా చాలా జాగ్రత్తపడి "ముఖస్తుతి చెయ్యడం కాదు. ఇన్నాళ్ళకు నీతివేత్త అధీనం అయింది దివాంజీ పదవి'' అని ప్రశంసించారు.

"నీతివేత్త" అన్నమాట చెవిని పడేటప్ప టికి "ఆత్మోదయః పరగ్లాని ర్ద్వయం నీతిః" అన్న మాఘుని సూక్తి మెరుపు తీగలాగ కళ్ళయెదట మెరిసిన ట్టయింది చెంచు పున్నయ్యకి.

ఆ మెరుపు అతని మొగాన గప్పు మంది.

"చూడండీ" అంటూ వెంటనే ఆవేశంతో ప్రారంభించా డతను.

"వెంకటయ్యపంతులు పెద్దమొత్తం సంపా దించా డనే వొప్పుకుందాం. కనక, పుద్యో గం పోయినా దర్జాగానే కాలం గడపగల డనిన్నీ అంగీకరిద్దాం. మరి ఆయనకు జరిగిన అవమానం తక్కువదా? లక్షలు గడించడమే పరమార్థమా? భిక్ష మెత్తుకుంటే గడిచిపోయ్ జీవితం ? అవమానం కంటే మరణమే మం చిది కాదూ? రామసుబ్బయ్య, ఆయని అవస్థ చూసిన్నీ నీతిగా వుండలేకపోయాడు. నలభై సంవత్సరాలుగా దివాన్గిరీలో పాతుకోకుయిన వాణ్ణి వెల్లగించి పారేసిన ప్రభువుకి, సంవత్స రం దివాంజీపదవి వెలిగించినవా డొక లెక్కా జమా? నూరురూపాయల జీతగా డొక్క సంవత్సరంలో లక్షరూపాయలు చేర్చడం కంటే ఘోరకలి యేమయినా వుందా? రాజు ద్రవ్యం హరించడమే కాదు, ప్రజలను పీడించి లంచాలు మెయ్యడమూ పశుకృత్యమే. "రాజ్యాంతే నరకం ధ్రువం" అన్నారు పెద్దలు. అయితే, రాజును గురించిమాత్రమే వా రలా చెప్పి వూరుకోడం బాగాలేదు. అసలు, అది, పూర్ణ మైన సూక్తి కానేకాదు. నేను చెప్పే దేమంటే? రాజుకి కాదు, దారితప్పితే రాజసేవ చేసినవాడికిన్నీ నరకం తప్పదు. కనక, మనం జాగ్రత్తగా వుండాలి. నామట్టుకు నేను, పొట్టగడవక యీపదవి స్వీకరించడం లేదు. మంత్రిపదవి మహోన్నతం కాని నీచం కాదని నేను ఋజువుచేసి చూపిస్తాను. గుమాస్తాగా వుండి పైకి వచ్చిన ప్రతీవాడూ గడ్డిమేసే వాడు కాలే డని నిదర్శనం చూ పించా లని నేను నిశ్చయించుకున్నాను. దివాంజీ అయినవా డల్లా రాక్షసవృత్తి అవలం బించలే దని రైతులకు విశదం చెయ్యడాని కిన్నీ నే నీపదవి స్వీకరిస్తున్నాను. నా పూనిక పరమపవిత్రమైనది. నా పూర్వుల తపస్సు నాకు అండగా వుంటుం దని నే నెరుగుదును. మన మందరమూ ప్రభువు ద్రవ్యం తిని జీవి స్తున్నాం. చాలకపోతే చెప్పుకుందాం చెమట వోడ్చి పనిచేసి, వారి హృదయం కరిగించి, వారి అన్నంలో భాగం పుచ్చుకుందాం. తెలి సిందా? మనకి పంకరదారులు పద్దు. ఎవ డయినా సరే, తప్పుదారి తొక్కాడా, నేను మారణం చేసేస్తాను."

మాట ముగియడం తడవుగా కూచున్నా డతను. కూచోడం తడువుగా కలం పుచ్చుకుని "ఇదిగో రాజీనామా కాగితం రాసేస్తున్నాను. సేవ ప్రధానమైన వాడి చిత్తశుద్ధి కింతకంటే నిదర్శనం మరి లేదు. ఇదెప్పుడూ నా జేబులో వుంటుంది. ఉండడమే కాదు. ఎప్పుడు ప్రభువు చెయ్యి అలింకరిస్తామా అని నిరీక్షి స్తూనే వుంటుంది. నన్ను నమ్మి ప్రభువు నన్నింతవాణ్ణి చేశారు. ఈశ్వరుణ్ణి నమ్మి నేను ప్రభువునూ, ప్రజలనూ సేవించుకుంటాను" అని చెబుతూ రాత ముగించి, సంతకమున్నూ చేసి, మడిచి చక్కని కవరులో వుంచి జేబులో పెట్టుకున్నాడు.

దానిమీద యేమి చెయ్యాలోతోచక తక్కిన గుమాస్తా లందరూ మొగముగాలు చూసుకుంటూవుండగా, అప్పల నరసయ్య అందుకుని "తమరు కొత్తశకం ప్రారంభిస్తున్నారు, చాలాచాలా సంతోషం. ఏమంటే? ఇంత వరకూ, ఈ దివాణంలో దివాన్గిరీ చెలాయించినవారు తమలాగ వొక్కరయినా ఝుమాఝుంచి యిలా మాట్లాడ గలిగారా ? పదవీ స్వీకరణం చేసిన శుభసమయాన, కింది గుమాస్తాల కిలాగ ధర్మబోధ చెయ్యా లనీ, లోకానికిలాగ సందేశం యివ్వాలనీ, మొదట్లోనే తమ విశాలహృదయం యిలాగ తెరిచివెయ్యాలని వారిలో యెవరి కయినా తోచిందా? రాజీనామా కాగితం రాసి జేబులో సిద్ధంచేసి వుంచుకోడం దాకా యెందుకూ, దాని పవిత్రత అయినా వారికి అవగాహన అయిందా ? నేను నిజం చెబుతున్నాను. వారికి పదవే ప్రధానం. తమకు పరువే ప్రధానం. దివాంజీపదవి తమ దృష్టిలో వొక గడ్డిపరక. పూతిక పుడక. పూతిక పుడకను, నావంటి ముసలివాడు భోజనం చేశాక పళ్లు కుట్టుకోడానికి స్వీకరిస్తాడు. తమరు లోకంలో అక్రమాలులేకుండా తుడిచివెయ్యడానికి స్వీకరించారు. కనుకనే, ఇందరుండగా ప్రభువుదృష్టి తమమీద పడింది. తమరు ధన్యులు. తమకు చేతికింది కింకరులం కాగలిగినందులకు మేమున్నూ ధన్యులమే. మన జమీందారీ యిక నిత్యకల్యాణం పచ్చతోరణంగా భాసిస్తుంది, సందేహం లేదు" అని సవినయంగా చెప్పాడు, మాటిమాటికీ అంజలిబంధం నుదుటి కానించుకుంటూ.

ఇంత గ్రంథం జరిగినా ఒక్క గుమాస్తా అయినా కరతాళధ్వనులు చేసిన పాపాన పోలేదు. అందుకు, మొదట, చాలా కటకట పడి, తరవాత "కూపకూర్మాలు, వీళ్ళ కేం తెలుసునూ?" అంటూ జాలిపడి, చివరికి, వాళ్లకి స్బుద్ధి రావాలని టేబిలు అదిరేటట్టు తానే రెండుమాట్లు చరిచి, దివాంజీదర్జా పుణికి పుచ్చుకున్నాడు చెంచు పున్నయ్య.

రాయణింగారి కిదంతా తెలిసింది.

సాయంత్రం యింటికి వెళ్లి, రాత్రి భోజనం చేసి, తానూ తన భార్యా కూడా కొత్త అంతస్థుతో ఆరుబైట నులకమంచంమీద చంటిపిల్ల కావైపునా యీవైపునా కూచుని; కాస్తసేపు ఆమాటా యీమాటా చెప్పుకునేటప్పటికి "జీవితం అంతా దివాంజీపదవిలో గడిపిన వెంకటప్పయ్య టప్పున యెగిరిపోయాడు. ఒక్క సంవత్సరం పూర్తికావడం తడవుగా రామసుబ్బయ్య కూడా ప్రవాహంలో పడి కొట్టుకుపోయాడు. ఇక మన లెక్కయేమిటీ? కనక, జాగ్రత్తపడాలి" అని చెంచు పున్నయ్యకున్నూ దివ్య ప్రేరేపణ కలిగింది.

వ్యవహారం ఆకళింపు చేసుకునే టప్పటికొక నెల గడిచింది.

గుమాస్తాల కందరికీ తరుచు రాయణింగారి పిలుపు వస్తోందనీ, ఎప్పుడూ దివాణం తొక్కి యెరగని వూరి పెద్దమనుష్యులకున్నూ చాలామందికి తరుచు అయాచితంగా రాయణింగారి దర్శనం అవుతోం దనీ చెంచు పున్నయ్యకి ఆకళింపు అయింది.

దినాని కొక స్టేటుమెంటు ప్రారంభించాడతను.



కిన్నెర

దీంతో మరోనెలకూగడిచింది.

ఏ గుమాస్తాని ఏమ్మని గంటకొట్టినా "వర్తమానం రాగా ప్రభువు సన్నిధికి వెళ్లి వున్నా"రని మరో గుమాస్తా వర్తమానించడమూ, తన గది గుమ్మానవుండే నౌకరుతప్ప తరుచు మరొకడు కనపడక పోవడమూ. కనపడినా, రాయణింగారి పేరు చెబుతూనే దాటిపోవడమూ, బాహాటంగా ప్రారంభం అయింది.

ఈస్థితిలో మూడోమాసం గడిచింది.

షరాబు వచ్చి అప్పుడే జీతం సమర్పించుకుని వెళ్లాడు.

అతని వెనకనే అప్పల నరసయ్యవచ్చి "బాబూ, రాజీనామా కాగితం చేబులో వుంచుకునే దయచేశారా యివాళ?" అనడిగి, ఇంతలో బైరన్న రాగా తప్పుకున్నాడు.

బైరన్న అయినా. వొక కాగితం బల్లమీద వుంచి చక్కాపోయాడు. పెదవి అయినా కదపకుండా.

విప్పి చూడగా "విన్ను పనిలోనుంచి తీసివేశాం" అన్న శ్రీముఖం అది.

కుర్చీలో వున్నవాడు వున్నట్టుగానే కుంగిపోయాడు వెంకటపున్నయ్య, గుడ్లు తేల వేసుకుని.

అందరిలోనూ చిన్న గుమాస్తా కామన్న వచ్చి "తాళాలు" అని లొకాయించే దాకా యీలోకం యెరగడతను.

## 4

ఛార్జీ పుచ్చుకోడం తడువుగా కామన్నకి స్నైర కూడా గుమాస్తాల నందరినీ చేర విలిచాడు.

అది చూసి, వారు, అతనున్నూ ఉపన్యాసం పేలగొడతా డనుకున్నారు. కాని "మీ రెవరూ నా దగ్గిరికి వస్తూవుండనక్కరలేదు. నౌక ర్లున్నారు. ఎప్పటికప్పుడు కాగితాలు పంపుతూ ఉండండి. అవసరం అయితే నేనే పిలిపించుకుంటాను. ఏ రోజున వచ్చిన కాగితం ఆరోజునే వెళ్లిపోవాలి. రావలసినకాగితాలుంటే తాఖీలకు రిమైండర్లు పంపండి. ఉదయం పదకొండు కొట్టాటప్పటికి కచేరీలో వుండాలి. సాయంత్రం అయిదు కొట్టిందా, కచేరీకి తాళాలు పడిపోవాలి. క్షణం ఆలస్యం కావడానికి వల్లకాదు." అని చెప్పాడు కామన్న కచ్చితంగా.

కోరి అప్పల నరసయ్యని పరసనల్‌గా వేసుకున్నాడతను.

ఈ యెత్తేమిటో వొక్క గుమాస్తాకూ బోధపడలేదు.

అప్పల నరసయ్యమాత్రం యెందుకో "సెబాస్" అనుకున్నట్టు తల పంకించుకున్నాడు.

రాయణింగారికిన్నీ యిదంతా తెలిసింది.

ఉలిక్కిపడ్డా రాయన.

ఆయనకూ ఏమీ అర్థంకాలేదు.

"ఏమి పని వున్నా, ఎంత తొందరఅయినా ఎవ రయినా సరే, కాగితాలు పంపుకోవలసిందే గాని స్వయంగా ఆఫీసుకి రావడానికి వల్లకాదు.

గుమాస్తాలూ నౌకర్లూ తప్ప మరెవడో ఆఫీసులో అడుగు పెట్టగూడదు" అని రెండోనాడు మరొక ఆజ్ఞ చేశాడు కామన్న.

మున్సబు కరణాలకూ, తాణేదార్లకూ, సముద్దార్లకూ, తక్కిన పౌరుగూళ్ళ సిబ్బందికీ గూడా "మీ రెవరూ హెడ్డాఫీసు తొక్కి చూడగూడదు. మా ఆజ్ఞ అయితే తప్ప రాజధానికే రాగూడదు. వ్యవహారం అంతా కాగితాలమీదా, అంచె టపాలమీద జరగాలి. ఏ మాత్రం ఆలస్యం అయినా మాట తక్కదు" అని ఆవేళే తాఖీదులు వెళ్ళిపోయాయి.

దేవతాదర్శనం చేసుకోడానికి వచ్చినవారికేమాత్రం అసందర్భాలు జరిగినా, జరిగవలసిన పూజలూ సేవలూ మొదలైనవాటిలో లోపాలూ లోట్లూ ఏమువచ్చినా కఠినశిక్షలు పడతాయని దేవస్థానం సిబ్బందికీ, దుర్వ్యయాలూ, అపహరణాలూ, అసందర్భాలూ ఏమాత్రం జరిగినా భోజనం చేసేవారి కేవిధమైన రిష్టంతోచినా చీరేస్తా మని సత్రం సిబ్బందికీ ఆజ్ఞలువెళ్లాయి.

తన దగ్గిరికి వచ్చిన ప్రతీ కాగితమూ— చిన్న దయితే, ఉంటే సందేహాలు తీర్చుకుని అప్పల నరసయ్య ఎండార్సు రాయడం—పెద్దదయితే కామన్నే స్వయంగా చదువుకుని ఎండార్సు రాసెయ్యడం —చివర కన్నిటిమీదా కామన్న సంతకం పడిపోడం-అప్పటి కప్పుడే అవి యెక్కడి వక్కడికి బయలుదేరి వెళ్ళిపోడమున్నూ నిరాఘాటంగా జరిగిపోసాగింది.

తమ సంతకం కావలసిన కాగితం తమ దగ్గిర నిలవవుండిపోతే తమకే రిమైండర్లూ వార్నింగులూ ప్రారంభం కావడమూ, ఏ గుమాస్త నయినా, చివరికి ఏనౌకర్నయినా ఆఫీసు కాలంలో తమ దగ్గిరికి పిలిపించుకోవాలంటే కామన్నకు చీటీ రాసుకోవలసిన గతి పట్టడమూ. అయినా, వొక్కొక్కప్పుడు కోరిన మనిషి అందకపోడమూ—రాయణింగారికే యిలాంటి అదుపాజ్ఞలు ప్రారంభం అయిపోయాయి.

ఆఫీసులో పనిచేసేవారి కందరికీ, తమ యిళ్ళచుట్టూ కామన్న నమ్మినబంట్లు ప్రచ్ఛన్నంగా తిరుగుతున్నారని గాలివార్త లందాయి.

అందరికీ వూపిరి నిలిచిపోయింది.

ఈస్థితిలో మొదటినెల గడిచింది.

ఒకటోతేదీని ఆఫీసులో అడుగుపెట్టారు, అందరికీ జీతాలు చేతిలో పడ్డాయి.

అయితే పదోతేదీ దాటితేగాని—అప్పు డయినా దినానికి కొందరు కొందరికే గాని అందని జీతాలు మొదటితేదీనే అందినందుకు సంతోషించడమా, జేబులునిండే పైపంట మాడిపోయినందుకు విచారించడమా?

ముందు, గుమాస్తల కందరికీ ముచ్చెమటలూ పోశాయి.

తరవాత, నౌకర్లకు ప్రాణాలమీదికివచ్చింది.

చివరికి, కాసాలకున్నూ గుడ్లుమీదికి వచ్చాయి.

రెండో నెల కూడా గడిచింది.

కృతయుగంఅయిపోయి మరీ గడిచిందది.

మళ్ళీ మొదటితేదీనే జీతాలు చేతికివచ్చాయి.

కాని, యేమిలాభమూ, సలుసయినా అంటి వుండకుండా కడిగివేసిన రూపాయ లవి.

అయినా యెలాగో సరిపెట్టుకుందా మంటే ర_క్తమున్నూ పీల్చేసిన రూపాయ లవి.

అందరూ కటకటలాడిపో సాగారు.

గుంపులు కూడసాగారు.

గుసగుసలు పోసాగారు.

కామన్న దివా సయి వున్నంతకాలమూ తమపని యింతే అని వారు నిరాశచేసుకున్నారు.

ఆలోచనలు ప్రారంభించారు.

ప్రచారాని కందుకున్నారు.

సాయంత్రం అయి దయిందంటే, దగ్గిరవుండి స్వయంగా ఆఫీసుకి తాళాలు వేయించి గుర్ర బ్బండిమీద ఇంటికివెళ్ళపోతాడు కామన్న.

అప్పల నరసయ్య కూడా పాత సైకి లెక్కుతూ దిగుతూ చక్కాపోతాడు.

గుమాస్తాలూ నౌకర్లూమాత్రం, కామన్న వెళ్ళేదాకా వెడుతున్నట్టే వెడుతూ వెనక్కి మళ్ళుతారు.

తమ కష్టాలూ, తమ కల్పనలూ రాయణీం గారితో చెప్పుకోవాలంటే అంతకంటే మరి వారికి సమయం లేదు.

అయితే, రాయణీంగారికి, రాణీగారి వెంట కోటలోనే వున్న పూలతోటకి వెళ్లే సమ యం అది.

క్షణం ఆలస్యం అయితే రాణీగారు మహిషాసురమర్దని అయిపోతారు.

కాని, యీ కొ_త్త దివాంజీ చర్య తమ కున్నూ ఉక్కిరి బిక్కిరికలిగిస్తూ వుండడంవల్ల గుమాస్తాల బాధలూ, నౌకర్ల గోలా యేమిటో విందామని, ఉండుండి ఒక్కనాడు పిలుచేసు కున్నారు రాయణీంగారు.

అందరూ కాళ్లమీద పడ్డారు.

మనిషి కొకమాట, నోటికొక విధం—— ఇంతే భేదం.

మొత్తానికి "కామన్నగారూ దిటో ప్రకా రమే మహాప్రభూ" అని సిందితార్థం.

దానికి వన్నెలూ చిన్నెలాను. ఓమాత్రం ప్రతిభావంతులు అవి నమ్మకుండా వుండలేరు.

రాయణీంగా రయినా కామన్న వచ్చేదాకా గుమస్తాల మాటలు వేదవాక్కులుగా భావించిన వారే; కాని కామన్న చాకచక్యం అందరినీ విడిచి రాయణీంగారి హృదయం శాశన చేసేసింది.

దాంతో, రాయణీంగారు, గుమస్తాలకూ నౌకర్లకూ కష్టాలుంటే వుండవచ్చు నను

కి న్నె ర

కున్నారు; గాని కామన్న ద్రోహి అంటే మాత్రం నమ్మలేకపోయారు.

దానిమీద, గుమస్తాలు "మా కష్టాలకేం, అసలు, నౌకరి సేవచెయ్యడమే వొక కష్టం. అది యిష్ట మయితే తక్కిన కష్టాలు లెక్కకు రావు. మామాట కాదు మేము చెప్పుకునేది. కామన్నగారు తడిపాతని గొంతుకోసే రకం మహాప్రభూ" అంటూ ప్రారంభించారు.

గుమస్తాలే కాదు, నౌకర్లే కాదు. కామన్న మొగ మయినా చూడవలసిన అగత్యం లేని వంటవాళ్లున్నూ యిదే మాట.

రాణీగారితో తప్ప మరెవరితో మాట్లాడాని కయినా రాయణింగారికి కంపం యెత్తి పోయింది.

## 5

"పూర్తి కావడం అంటూ వుందా?" అని పించుకుని మరి గడిచిపోయింది, మూడో నెల:

ఎవరి జీతాలు వారికి ముట్టాయి.

అందరికీ జీతా లిచ్చే రాయణింగారికి హాహా కారాలు ముట్టాయి.

భరించలేకపోయా రాయన.

ఒకనాడు కామన్న ఆఫీసుగదికే బయలు దేరారు రాయణింగారు.

కామన్న యెదట కూచుని యేదో కాగితం చూస్తూ ఆలోచన చేసుకుంటున్న అప్పల నర సయ్య, వారిని చూసి "చిత్తం చిత్తం" అంటూ కంగారుపడుతూ లేచి నుంచున్నాడు.

చూడగా. రెండుచేతులా ద్వారబంధం రెమ్మలు పట్టుకుని, కొంచెం వంగి లోపలికి చూస్తూ రాయణింగారు.

రాస్తూ రాస్తూ వున్న కాగితం సందుగా పెట్టెమీదే వుంచేసి. కలంమాత్రం చేతిలోనే వుంచుకుని. నిశ్చలంగా లేచినుంచున్నాడు కామన్న.

"కామన్నా !"

"ఏమి సెలవు మహాప్రభూ ?"

"తాసికలు చెప్పేవాళ్ల నేమిచెయ్యాలోయ్?".

"ఆ, యేముందిబాబూ, వినేవాడి చెవులు తెగ్గోస్తే సరి"

అప్పల నరసయ్య తుళ్లిపడి చూశాడు.

బిగపట్టుకున్న వూపిరి విడిచి, ద్వార మున్నూ నెమ్మదిగా వదిలిపెట్టి, తా పీ గా వెనక్కి తిరిగి, బుర్రవంచుకుని వచ్చినదారినే చక్కా పోయారు రాయణింగారు.

# కొరియా చరిత్ర

రి ప్ర కా ప డు”

దాదాపు మూడు కోట్ల జనాభా, 12,000 చదరపుమైళ్లు విస్తీర్ణం కలిగివున్న కొరియా చైనాను ఆనుకొనివున్న ద్వీపకల్పం.

క్రీస్తుపూర్వం 2,333 వ సంవత్సరంనుంచి మాత్రమే రేఖామాత్రంగా కొరియా చరిత్ర లభ్యమౌతుంది.



మేజర్ జనరల్ డీన్. కొరియాలోని అమెరికన్ సైన్యాల కమేండింగ్ జనరల్.

ఆకాలంలో డాన్‌కూన్ కొరియాను పరిపాలించాడని చైనా చారిత్రక గ్రంథాలవల్ల తెలుస్తుంది. తన రాజధాని అయిన జైర్యుంగ్ నుంచి ఒక వార్త చైనాలోని యాక్ రాష్ట్రానికి ఆయన పంపించాడని చైనా గ్రంథాలలో ఉగ్గడించబడింది. సోల్ సమీపంలోని కాంస్‌వా దీవులలో ఒకఆయన దేవాలయాన్ని కూడానిర్మించాడట. చరిత్రకు లభ్యమైనంతవరకు ఈయనే కొరియాకు తొలిరాజు అని చెప్పవచ్చు. డాన్‌కూన్ వంశీయులు ఆనాటినుంచి చాలా కాలంవరకు అనగా దాదాపు వెయ్యి సంవత్సరాలకు పైగా పరిపాలించారు.

పూర్వం 1,162 వ సంవత్సరంలో పరిపాలిస్తున్న షాంగ్ వంశంపై విప్లవం జరుగగా ఆవంశం పతనమైపోయింది. చౌ రాజవంశం అధికారంలోనికి వచ్చింది. అంపటితో కొత్త రాజు కొలువులో ఉండలేక పాతరాజుకు విశ్వసనీయుడైన ఉన్నతోద్యోగి కీ-ట్సు తన దేశాన్ని వీడి తూర్పుగా, సూర్య భగవానుడు జన్మించే స్థలానికి వెడదామని బయలుదేరి వెళ్లాడు. ఇలా పోగా, పోగా సముద్రంలోనికి జొచ్చుకొనిపోయి ఉన్న కొరియా ప్రాంతానికి చేరాడు. అక్కడి ప్రకృతి సౌందర్యానికి వివశుడై దానికి “చోజెన్”

(ఉషఃకాలంలో ప్రశాంతంగా వుండే భూమి) అని పేరుపెట్టాడు. అదే క్రమేపీ కొరియా అయింది.

కీ-ట్సుతో పాటుగా 5 వేలమంది చైనీయులు కూడా వచ్చారు. వారిలో చిత్రకారులు, లలితకళాకారులు, రైతులు, కుటీర పరిశ్రమలలో ఆరితేరినవారు వున్నారు. వారందరు చెమటోడ్చి ఆనాటికి దుర్గమారణ్యంగా వున్న ఆ దేశాన్ని సస్యశ్యామలం చేశారు.

తరువాత కొంతకాలానికి, అనగా భారత దేశంలో అశోకుడు రాజ్యమేలుతున్నకాలంలో, చైనాలో షి క్ హ ం గ్ రాజ్యాధికారానికి వచ్చాడు. ఆతడు అతి క్రూరుడు. చరిత్రనే నాశనం చేసి, తానే తొలి చక్రవర్తిగా శ్లాఘింపబడాలని ఆదేశించిన చండశాసనుడు. అతని బాధలకు తాళలేక, చైనావారు కొందరు చోజెన్ (కొరియా) కు వలసవెళ్లి, అక్కడ రాజ్యమేలుతున్న కీ - ట్సు వంశీయులను జయించి కొంతకాలం వారు పాలించారు. అటు పిమ్మట చోజెన్ (కొరియా) అనేక చిన్న చిన్న స్వతంత్రరాజ్యాలుగా విడిపోయింది.

పదుగురు చిన్నరాజులు చేరగానే, ఎవరికి వారు చక్రవర్తిత్వాన్ని సాధించాలన్న ఉబలాటంతో ఇతరులతో కయ్యానికి కాలు దువ్వడం ప్రారంభించారు. ఈవిధంగా అంతః కలహాలు పెరుగగా, ఇందులో ఒకరాజు సహాయం చేయవలసిందిగా చైనారాజును అర్థించాడు. ఆతనికి సహాయం చేయడానికి వచ్చిన చైనారాజు సేనలు తిరిగి వెనక్కుపోక అక్కడే స్థిరపడిపోగా, ఆ రాజు చైనాకు సామంతుడైనాడు. తరువాత ఒకటి తరువాత మరొకటిగా అన్నిరాజ్యాలు చైనాకు లోబడిపోయినవి.

క్రీస్తు అనంతరం 913 వ సంవత్సరంలో వాంగ్‌కీన్ అనే మహాపురుషుడు అనేక చిన్నచిన్న రాజ్యాలు వున్న ఈ చిన్నఖండాన్ని ఏకరాజ్యం చేయడానికి కృషిచేసి వి జ య ం పొందాడు. ఆవిధంగా సమైక్యమైన అన్ని రాజ్యాలకు కలిపి "సీరై" అని వాంగ్ నామకరణం చేశాడు. దానికి ఆయనయే తొలిరాజు అయినాడు. అక్కడినుంచి 450 సంవత్సరాల వరకు ఆ దేశాన్ని ఆయన వంశీకులు పరిపాలించారు.

ఇంతకాలంగా, దాదాపు వెయ్యి సంవత్సరాలుగా చైనీస్ అక్షరాలనే వాడుకుంటూ, వారి సంస్కృతినే అనుకరిస్తూ చైనానే కొరియనులు అనుగమించారు. అయితే, 12 వ శతాబ్దంలో తమ వాడుకభాషకు అనుగుణంగా ప్రత్యేకంగా వర్ణసముచ్చయాన్ని వారు సమకూర్చుకున్నారు.

భారతావనినుంచి శిల్పకళాసాంప్రదాయాలు, తదితర కళారీతులు, బౌద్ధమతంతోపాటుగా చైనాకు, అక్కడినుంచి కొరియాకు, అక్కడినుంచి జపాన్‌కు ప్రాకిపోయినవి.

గృహనిర్మాణంలో, తదితర పరిశ్రమలలో, ముఖ్యంగా నౌకా పరిశ్రమలో చైనావారిని తు. చ. తప్పకుండా కొరియన్‌లు అనుకరించేవారు.

క్రీస్తు అనంతరం 1,200 సంవత్సరం ప్రాంతంలో మంగోల్‌నుంచి ఛెంగిస్‌ఖాన్ ఉత్తరచైనాను, అటుపిమ్మట మంచూరియాను

జయించి, పెకింగ్‌ను కూడా వశపరుచుకొని కొరియాలో ప్రవేశించాడు. దానితో కొరియా కూడా అతనికి దాసోహమనక తప్పలేదు. అదిమొదలు దాదాపు 200 సంవత్సరాలదాకా తిరిగి కొరియా మొత్తం పరదాస్యానికి లోనయింది.

అటుపిమ్మట 1592 వ సంవత్సరంలో జపాన్ చక్రవర్తి హిడియోషి ఆదేశంపై సైనికులు దండెత్తారు. కాని, సమయానికి చైనా అడ్డుపడి కొరియాను ఆదుకొన్నది. అయినప్పటికీ, ఆరు సంవత్సరాలుగా జరిగిన ఈ యుద్ధంలో కొంత భూభాగం జపాన్‌వారి వశం కాకపోలేదు. అయితే. 1598 లోనే జపాన్ చక్రవర్తి మరణించినందున కొరియాలోని జపాన్‌సేనలు మాతృదేశానికి రప్పించబడినవి.

అదిమొదలుగా కొరియా రాజులకు, జపాన్ చక్రవర్తులకు అడపా దడపా యుద్ధాలు జరుగుతూ వచ్చాయి. 1790 వరకు ఈవిధంగా ఒక దానిని మరొకటి కవ్విస్తునే వుండేవి.

1866, 1867, 1871 సంవత్సరాలలో కొరియాలోని కొన్నిభాగాలపై ఫ్రెంచివారు దాడిచేశారు గాని ఏభాగాన్ని వారు ఆక్రమించుకోలేదు.



కొరియాలోని సోమెల్ నగరందగ్గర అమెరికా విమానదళం బాంబులను విసరుట.

1892 లో చైనానుంచి మంగోల్స్‌ను చైనా జాతీయవాదులు తరిమివేయడంతో కొరియాలో విప్లవం ప్రారంభమైంది. ఇచై-జో అనే రాజు మంగోలులకు దాసోహమన్న కొరియన్ రాజులను తరిమివేసి, మొత్తం భూభాగాన్ని ఆక్రమించుకొని, చైనా చక్రవర్తికి కప్పం చెల్లిస్తున్నప్పటికీ, యింతవరకు స్వతంత్రంగా చాలాకాలం పరిపాలన సాగించాడు.

ఆ తరువాత తిరిగి జపాన్‌తో అనేకసార్లు కొరియాకు యుద్ధం తటస్థిస్తూ వచ్చింది. అనేకసార్లు జపానీస్‌ను వారుజయిస్తూ వచ్చారుకూడా. ఈ యుద్ధాలలోనే "తాబేయి" ఆకారంలో ఒక యుద్ధనౌకను నిర్మించి, దానితో జపాన్‌వారిని నిర్జించి, అమెరికాకంటె 250 సంవత్సరాలు పూర్వమే యుద్ధనౌకను నిర్మించిన ఖ్యాతిని కొరియా పొందగలిగింది. ఇంకొక చిన్న విశేషం కూడా వుంది. ఒక్క అమెరికా తప్పితే జపాన్‌ను ఓడించిన అన్యరాజ్యం కొరియా ఒకటే. 1598 లోనే తొలిసారిగా అది జపాన్‌ను నిర్జించింది.

1874 సంవత్సరం నాటికే జపాన్ సర్వ శక్తిసమన్వితమైన రాజ్యంగా రూపొందింది. తన సామ్రాజ్య విస్తరణకు, వ్యాపార సౌకర్యాలసాధనకు అన్యదేశాలపై దండయాత్రలకు అది తలపడవలసిరాగా, కొరియాయే దానికి మొదటి కబళంగా కనుపిస్తూ వచ్చింది. జపాన్‌కు జడిసి అప్పుడు కొరియా తరఫున నిలబడ్డానికి చైనాకూడా జంకింది. అందుచేత చైనా సలహాపై 1882 లో ఫ్రాన్స్, రష్యా, ఇంగ్లండ్, జర్మనీలతోకూడా కొరియా ఒడంబడికలు చేసికొనక తప్పలేదు. దానితో కొరియా వ్యవహారాలలో జోక్యం కలిగించే అవకాశం అన్ని రాజ్యాలకు లభించింది.

1894-95 సంవత్సరంలో జరిగిన యుద్ధంలో చైనాను జపాను నిర్జించి, కొరియాతో యూరోపియన్ రాజ్యాలతోపాటు సమానాధికారాలను దౌర్జన్యంతో పుచ్చుకున్నది. అయితే కొరియాను స్వతంత్రరాజ్యంగా ప్రకటించింది గాని ఎన్నడూ దానిని స్వతంత్రంగా వ్యవహరించ నివ్వలేదు. 1905 లో రష్యాను జపాను జయించింది. అప్పటినుంచి కొరియాపై తన ఆధిపత్యాన్ని జపాను నిలుపుకొన్నది. చైనా, రష్యాలతో అంతకుపూర్వం ఎన్నిసార్లు జపాను యుద్ధం చేసినా మంచూరియా, కొరియాల కొరకే. తుదకు 1905 లో తన లక్ష్యాన్ని అది సాధించుకొనగలిగింది. ఆయుద్ధానంతరం జరిగిన సంధిలో తనకు సామంతుడుగా పుండేటట్లు కొరియారాజుచేత సంతకం చేయించుకున్నది. అయితే, అంతటితోనే ఊరుకొనక 1907 లో ఆ రాజును తొలగించి, యువరాజుకు పట్టంగట్టి రీజెన్సీపేర తనే పాలనాధికారాన్ని హస్తగతం చేసుకున్నది.

1909 లో కొరియా యువరాజు ఇటూను ఒక కొరియన్ హత్యచేయగా సర్వాధికారాన్ని రీజెంటు అయిన టెరేచీ పుచ్చుకొని అకౄరాలా రాక్షసపాలన నడిపాడు. అతని బాధలకు పడలేక 1916-17 సంవత్సరంలో అనేకమంది ఆత్మహత్యలు చేసుకున్నారు. పోయినవారు పోగా 82,121 మందికి శిక్షలు విధించబడినవి.

ఎంతగా దమననీతి పెచ్చుపెరిగితే అంతగా విప్లవజ్వాలలు వ్యాపించగలవు కనుక, అతని



ద్ధరంగానికి వెళుతున్న మెరి సై తేజా దగ్గర రైలునుండి దిగుట

నియంతృత్వానికి ప్రతిఫలంగా 1919 లో కొరియాలో పెద్దపెట్టున విప్లవం జరిగింది.

అయితే ఈ వుద్యమం విచిత్రంగా ప్రారంభమైంది. 1919 ఏప్రిల్ 23 వ తేదీన కొరియన్ రిపబ్లిక్ అవతరణోత్సవం జరుగుతుందని జాతీయ నాయకులు ప్రతి గ్రామానికి వెళ్లి అతి రహస్యంగా ప్రచారంచేసి అంతా సిద్ధంచేశారు. తీరా ఆనాటికి జపాన్ ఉన్నతోద్యోగులను విందుకు ఆహ్వానించి, విందుఅనంతరం రిపబ్లిక్ అవతరణ ప్రకటనను చదివారు. విస్తుపోతున్న జపాన్ ఉద్యోగులను వెంటనే పిలిచిన పోలీసులచే అరెస్టు చేయించి, కారులో బందిఖానాలకు పంపారు. ఇంత పకడ్బందీగా వారు ఉద్యమాన్ని ప్రారంభించినప్పటికీ వారంరోజుల లోపునే తిరిగి జపాన్ పోలీసులు విశృంఖలంగా విహరించి, ఉచ్చనీచాలను, ఉచితానుచితాలను పాటించకుండా కనబడినవారినల్లా బాది, దొరికినవారినల్లా అరెస్టుచేసి, జాతీయోద్యమాన్ని అణచివేశారు.

ఈ ఉద్యమంలో పాల్గొని అరెస్టుఅయిన వారిలో ఇప్పటి దక్షిణ కొరియా రిపబ్లిక్ ప్రెసిడెంట్ డాక్టర్ సింగ్మన్‌రీ ఒకడు. ఆయనను ఉరితీయడానికి అధికారులు సన్నాహాలు పూర్తి చేసి, రేపు పొద్దున్నే ఉరితీస్తామని ఆయనకు చెప్పనుకూడా చెప్పారు. కాని, పొరపాటున అమర్నాడు ఆయన ప్రక్కగదిలోని వ్యక్తిని వురితీసి, ఆయనను వదిలివేశారు. తుదకు పది సంవత్సరాలకు జైలునుంచి విడుదలై అమెరికా వెళ్లి, అక్కడ వేదాంతశాస్త్రంలో డాక్టర్ బిరుదంపొంది అక్కడినుంచి జాతీయోద్యమం నడిపాడు.

డాక్టర్ రీ వస్తుతః స్వాతంత్ర్యపిపాసి: త్యాగి: మహావీరుడు. కాని, అమెరికా సహాయం కొరకు ఆయన అర్రులు చాచడంలో ఇప్పుడు వారి ప్రాబల్యానికి లోనైపోయాడు.

1919 లో జాతీయోద్యమాన్ని విచ్ఛిన్నం చేసింది లగాయతు మరింత నిరంకుశంగా 1945 వరకు దానిని జపాన్ పరిపాలించింది.

1943 లో కెయిరోలో అమెరికా తరపున రూజ్‌వెల్ట్, బ్రిటన్ తరపున చర్చిల్, చైనా తరపున చాంగ్‌కైషేక్ సమావేశమై జపాన్‌ను ఓడించగానే కొరియాకు స్వాతంత్ర్య మివ్వగలమని ప్రకటించారు.

అప్పటికింకా జపాన్‌పై రష్యా సమరాన్ని ప్రారంభించలేదు. కాని, 1945 లో రష్యాకూడా జపాన్‌పై యుద్ధాన్ని ప్రారంభించనిదే, త్వరలో జపాన్ యుద్ధం పూర్తి కాదని గ్రహించిన అమెరికా దానిచేత కూడా జపాన్‌పై ముట్టడి జరిపించింది. ఆ సందర్భంలో పోట్స్‌డాం ఒడంబడిక జరిగింది. ఆ ఒడంబడికలో యాల్టా ప్రకటనను రష్యా కూడా ఆమోదించింది. అనగా జపాన్‌ను ఓడించి కొరియాకు స్వాతంత్ర్య మివ్వగలనని రష్యా కూడా హామీనిచ్చింది. ఆ తరువాత రెండు వారాలకు జపాన్‌పై రష్యా ముట్టడి ప్రారంభించింది. తుదకు 1945 ఆగస్టు 15 వ తేదీన అకస్మాత్తుగా జపాన్ శరణాగతి అయ్యేసరికి కొరియాలో ఉత్తరాన రష్యన్ సేనలు, దక్షిణాన అమెరికన్ సేనలు నిలచి వున్నవి. అది కొండలదేశం కావడంచేత జపాన్ శరణాగతి కలాపం పూర్తిచేయడానికై 38 వ అక్షాంశరేఖకు ఉత్తరంగా ఉన్న రష్యన్

సేనలకు అక్కడి జపాను సేనలు, దక్షిణంగా వున్న అమెరికను సేనలకు అక్కడి జపాను సేనలు లొంగిపోవాలని నిర్ణయించబడింది. ఆవిధంగా జపాను విజేతలలో ఒకపైన రష్యా ఉత్తర ప్రాంతంలో, మరొకటి అయిన అమెరికా దక్షిణ ప్రాంతంలో తిష్ఠ వేసినవి.

అది మొదలుగా కొరియాలో ప్రాబల్యానికై రష్యా, అమెరికాల మధ్య పోరాటం ప్రారంభమైంది.

జపాను శరణాగతి కార్యకలాపం పూర్తి కాగానే కొరియా సమైక్యానికై కృషిచేయాలని అటు రష్యా, ఇటు అమెరికా ప్రచారం ప్రారంభించినవి. అయితే, కమ్యూనిజానికి వ్యతిరేకి అయిన వారినల్లా కొరియా ప్రతినిధులు కారని రష్యా, కమ్యూనిస్టులు అసలు ప్రతినిధులు కారని అమెరికా అడ్డంకులు పల్కడంలో ఆ సమస్య మిత్రరాజ్యసమితికి ప్రతిపాదించబడింది. అందుకై మిత్రరాజ్య సమితి విచారణ చేసేందుకు ఒక సంఘాన్ని నియమించింది. ఆ సంఘం ఉత్తర కొరియాలో ప్రవేశించడానికే రష్యా చోటివ్వలేదు. కాగా, దక్షిణ కొరియాలో




అమెరికా పక్షాన భద్రతామండలి రాయబారియైన ఎర్నెస్ట్ ఎ. గ్రాస్, అమెరికాలోని కొరియా రాయబారి డాక్టర్ జాను ఎం. చాంగ్‌తో హస్తచలనం చేయుచున్నారు.

ఎన్నికలు జరిపించాలని ఆ సంఘం సలహా నిచ్చింది. దానితో ఆ కమిషన్ ఆధ్వర్యాన జరిగిన ఎన్నికలలో డాక్టర్ సింగ్మన్‌రీ నాయకత్వానగల నేషనల్ అసోసియేషన్ అధికారానికి వచ్చింది. ప్రవాసంలో వున్నప్పటినుంచి అమెరికన్లతో స్నేహం పొందినవాడు కావడంచేత ఆయనను అమెరికా నమ్మింది. అయితే. ఎంతకీ నోటిసహాయమే చేస్తూ వచ్చింది కాని, ధనసహాయం గాని, వస్తుసహాయంగాని అమెరికా చేయనేలేదు.

అందుచేత ఎంతో అభ్యుదయకర మార్గంలో ప్రారంభించబడిన సింగ్మన్‌రీ ప్రభుత్వం నియంతృత్వంలో పడక తప్పింది కాదు.

అధికారంలోనికి రాగానే, అనేక పరిశ్రమలను, బ్యాంకులను, పడవలను, రవాణా మార్గాలను డాక్టర్ రీ జాతీయం చేశారు. గనుల దారీలను నష్టపరిహారం ముట్టజెప్పకుండా రద్దు చేశాడు. జపాన్‌వారి స్వాధీనంలో వున్న ప్రతి అంగుళాన్ని లాక్కున్నారు. అయితే, విప్లవకరమైన నిర్ణయాలను పూర్తిగా విజయవంతంగా ఆయన అమలుజరపలేకపోయారు. డబ్బులేకపోవడం ఒకటి ముఖ్యకారణం. రెండవది వామపక్షీయులు, భూస్వాములు ఎదురు తిరగడం.

దాంతో ఆ అసరా చూచుకుని ఉత్తరాది కమ్యూనిస్టులు రీ ప్రభుత్వంపై దుష్ప్రచారం ప్రారంభించారు. ఈలోగానే 1949 జులైలో దక్షిణ కొరియానుంచి అమెరికన్ సేనలు కూడా తప్పుకున్నవి. అప్పుడు ప్రత్యర్థులను ఎదుర్కొనడానికి నియంతృత్వమే సాధనంగా డాక్టర్ రీ గ్రహించాడు.

ఐక్యరాజ్యసమితి కమిషన్ ఆధ్వర్యాన దక్షిణ కొరియా ఎన్నికలు జరిగి డాక్టర్ రీ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన సమయానికే ఉత్తర కొరియాలో కూడా పీపుల్స్ రిపబ్లిక్ పేరుతో కింసుంగ్ అధ్యక్షతన ఒక ప్రభుత్వాన్ని రష్యా నిర్మించింది. అటు తరువాత రష్యన్ సేనలు అక్కడినుంచి వైదొలగినవి.

అది మొదలుగా ఏకీకరణకై అనేకసార్లు ఉత్తర కొరియన్లు ప్రతిపాదించడం, అవి తిరస్కరించబడ్డం సంభవించింది.

దానితోపాటే సరిహద్దులలో సంఘర్షణలు ప్రారంభమైనాయి.

ఇలాఉండగా మొన్న మే నెలలో దక్షిణ కొరియాలో తిరిగి ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో డాక్టర్ రీ ప్రభుత్వమే తిరిగి అధికారానికి వచ్చినప్పటికీ, అప్పుడు జైళ్లలో ఉన్న ప్రజానాయకులు అనేకమంది ఎన్నుకొనబడినారు. దానినిబట్టి దక్షిణ కొరియా ప్రజాసీకానికి డాక్టర్ రీ ప్రభుత్వంపై ఎట్టి విశ్వాసం కలదో స్పష్టంకాగలదు.

ఇట్టి స్థితిలో జూన్ 25 వ తేదీన ఉత్తర దక్షిణ కొరియాల మధ్య యుద్ధం ప్రారంభమైంది.




(రివ్యూకై రెండుప్రతులు పంపాలి)

## 1984

రచన : జార్జ్ ఆర్వెల్ (George Orwell). ప్రచురణ : Secker & Warburg, Bloomsbury, London, W. C. 1 సైజు : 5"×7½". పుటలు : 312. వెల 10 షిల్లింగులు.

"ఏప్రిల్ మాసంలో ఒక....రోజున గడియారాలు 13 గంటలు కొడుతున్నాయి" అనే వాక్యంతో ఈ నవల ప్రారంభమవుతుంది. పాశ్చాత్యులకి 13 అపశకునపు సంఖ్య. అరిష్టాన్ని సూచించే ఈ ప్రారంభాన్ని గ్రంథకర్త బుద్ధిపూర్వంగానేచేశాడు. 1984 లో ప్రపంచ అవస్థ అత్యంత దుస్సహంగా ఉంటుందని హెచ్చరించడానికి వ్రాసిన నవల ఇది.

అనాటికి ప్రపంచమంతా మూడు మహారాజ్యాలుగా రూపుకడుతుంది. ఆ మూడురాజ్యాలూ ఒకదానితో ఒకటి ఎల్లప్పుడూ యుద్ధం చేస్తూ ఉంటాయి. స్థాపించబడ్డది శాశ్వత శాంతికాదు. శాశ్వతయుద్ధం ! ఎంచేతనంటే "యుద్ధమే శాంతి. బానిసతనమే స్వాతంత్ర్యం. అజ్ఞానమే బలం." ఈవిధంగా ఊహించేపద్ధతిని "డబుల్ థింక్" అంటాడు గ్రంథకర్త. "డబుల్ క్రాసింగ్" "డబుల్ డీలింగ్" వంటి మాటల్లోవున్న దగుల్బాజీతనాన్ని ఈ డబుల్ థింకింగ్కూడా సూచిస్తుంది.

"స్వాతంత్ర్యం అంటే, రెండుకి రెండుకలిపితే నాలుగుఅవుతుందని చెప్పగలిగే స్వాతంత్ర్యం" అంటాడు కథానాయకుడు. విన్‌స్టన్ స్మిత్ ఆనాటి సాంఘిక వ్యవస్థమీద తిరుగుబాటుచేసిన వ్యక్తి. పరిపాలకుల అభిప్రాయాలకు వ్యతిరేకంగా ఆలోచించడమే ఇతని తిరుగుబాటు."

రెండూ రెండు నాలుగు ఒక్కొక్కప్పుడు మాత్రమే. వేరొకప్పుడు రెండూరెండూ మూడు ! మరొకప్పుడు ఐదు: ఇంకొకప్పుడు ఇవన్నీను;" అంటాడు స్మిత్‌ను హింసిస్తున్న అధికారి. "మా అవసరాన్నిబట్టి నక్షత్రాలు చేరువగానూ ఉంటాయి, దూరంగానూ ఉంటాయి !" అంటాడతడు. డబుల్ థింకింగ్‌కి ఇదో గొప్ప ఉదాహరణ.

అధికారంలో ఉన్న పార్టీ ఆ సమయంలో ఏమని ఆలోచిస్తూవుంటే అదే ఒప్పు. దానికి విభిన్నమైనది తప్పు. ఏ వ్యక్తికీ స్వతంత్రంగా ఆలోచించే హక్కు లేదు. నీ ఆలోచనలను ఎల్లప్పుడూ కనిపెట్టే యంత్రాలున్నాయి. ఏమాత్రం నువ్వు పెడదారితొక్కినా పోలీసులు నిన్ను వెంటనే అరెస్టు చేస్తారు. వీళ్ళు థాట్ పోలీసులు. నీ ఊహలన్నీ వీరికెల్లప్పుడూ బట్టబయలు. ఎన్నడూ వీరి నిఘా

నించి నీవు తప్పించుకోలేవు. అసలు రహస్యంగా వుండగలగడమనేదే 1984 లో అసంభవం. ఇదీ ఆనాటి భయంకర వ్యవస్థ. ఇట్టిలోకంలో జీవిస్తున్న విన్‌స్టన్ స్మిత్ స్వతంత్రంగా బతకడానికి, స్వతంత్రంగా ఆలోచించడానికి సాహసిస్తాడు. ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. ప్రేమ అన్నింటికన్నా ఆకాలంలో గొప్పతప్పు. సెక్స్ క్రైమ్ అంటారు దాన్ని!

ఈ ప్రేమికులు కొన్నాళ్ళు పోలీసు నిఘానించి తప్పించుకొని తిరుగుతారు. (కాదు తిరుగుతున్నా మనుకుంటారు.) అమలులోవున్న సాంఘిక వ్యవస్థను పడగొట్టడానికి కుట్రచేస్తారు. దొరికిపోతారు. శిక్ష అనుభవిస్తారు. అదీ కథ.

నియంతృత్వాధికారం, కుడివైపుదయినా, ఎడం వైపుదైనాసరే, మానవత్వాన్ని హతమార్చుతుందని ఈ రచయిత చెప్పదలచుకున్నాడు. ఏ ఒక్కరి చేతులోనైనా కేంద్రీకృతమయిపోతే అధికారం అపాయాలకు దారితీస్తుందంటాడు. బెర్‌ట్రాండ్ రస్సెల్‌వంటి భావుకులు తొలినించీ ఈ మాటే చెబుతూవచ్చారు. ఆర్వెల్ తన నవలలో ఈ భావానికి గొప్ప రూపకల్పన చేశాడు.

ఇదివరలో భవిష్యత్తునిగురించి వ్రాసిన నవలలన్నీ ఉజ్జ్వల స్వర్గాలను చిత్రించాయి. కాని ఇటీవల వస్తున్న నవలలు భయానక నరకాన్ని చిత్రిస్తున్నాయి. మళ్ళీ మధ్యయుగపు అంధకారాలలోకి మానవజాతి పడిపోవచ్చునని హెచ్చరికచేసే నవలలివి!

కాని, "1984" లో ఒక విషయం మాత్రం స్పష్టంకాలేదు. విన్‌స్టన్ స్మిత్ కోరుతూన్న వ్యక్తిస్వాతంత్రం ఎటువంటిది? నలుగురూ ఎడం పక్కగా నడుస్తూఉంటే నేనుమాత్రం రోడ్డుమధ్య నడవడానికి స్వాతంత్ర్యమా? అందరూ లెఫ్ట్, రైట్ అని నడిస్తే నేనొక్కణ్ణే రైట్ లెఫ్ట్ అని అడుగు మార్చే స్వాతంత్రమా? వ్యక్తిస్వాతంత్ర్యం పరమ పవిత్రమైనదే. కాని సమాజ క్షేమం మాటో? కమ్యూనిజంలోని నియంతృత్వ లక్షణాలు జార్జి ఆర్వెల్‌కి ఇష్టంలేదు. కాని దానికి ప్రత్యామ్నాయం ఏదీ? అది ఇంకా అన్వేషణలోనే వుంది. ఈలోపున ఆర్వెల్‌వంటి ప్రతిభాశాలురు తమ కమ్యూనిస్టు వ్యతిరేకతను కథలరూపంగా ప్రదర్శించడంలో పెట్టుబడిదారీ విధానానికి పరోక్షంగా సహాయపడిన వారవుతున్నారు. వీరు రాసే నవలలవల్ల కుళ్ళిపోతూన్న ప్రతిపక్షశక్తులకు కొత్తబలం చేకూరగల ప్రమాదం ఉంది.

శ్రీ శ్రీ

## వాణిజ్య పూజ్యులు

మొదటిభాగము. కర్త: శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగారు, బి. ఏ. "ఆంధ్రభూమి" సంపాదకులు. క్రౌను ౧౧౨ పుటలు. వెల పన్నెండణాలు: ప్రచురణ: జయనికేతనమ్. మద్రాసు, 7. విక్రయము - ఆంధ్రభూమి బుక్కు డిపో, వేపేరి, మదరాసు 7.

ఇందులో వ్యాపారమువలన ధనవంతులై, పేరుపెంపులు గడించిన పదినెనమండ్రు విదేశీయుల విఖ్యాత చరిత్రములు సంగ్రహముగా నీయఁబడినవి. ఆరంభ మత్యల్పమయి, నీచమని తోఁచినను ఇందలి వాణిజ్యపూజ్యులు తమ వ్యాపారదృష్టినే ప్రధానముగాఁ గలిగి, విషయాంతరములను లెక్కగొనకుండుట - పాతపుస్తకములు, సిగరెట్లు, చెప్పులు మున్నగు వ్యాపారములను ప్రారంభించుట వలన స్పష్టమగుచున్నది. ఇట్టి చరిత్రములు చదివినవారి కుత్సాహ ముద్భవించి, వర్తకమున నభిలాష కలిగి, ధనికులగుటకును తన్మూలమున దేశసేవ యొనర్చుటకును ఎన్నియో అవకాశములు కలవు; విశేషించి విద్యార్థుల కిది యత్యంతావశ్యకము. ఈ గ్రంథము వ్యాపారరహస్యములనే గాక, జీవిత రహస్యములను గూడ వెల్లడించి, విద్యార్థుల నుత్తమపౌరుల నొనర్పఁగలదు.

కి షెన్ల శ

శ్రీ శేషగిరిరావుగారు మిగుల పరిశ్రమించి పెక్కు గ్రంథములను, పత్రికలను జదివి, వాని నుండి తాము గ్రహించిన విషయము నిట్లు గ్రంథ రూపమున నవతరింపఁజేసినారు: మన వాఙ్మయ మున నిట్టి విభాగమున తొట్టతొలిగ్రంథ మిదియే యని చెప్పవచ్చును.

భారతదేశమున వ్యాపారము అభివృద్ధి పొంద కుండుటకు మనవారికి దానియెడఁగల అనాదరము హేయత కారణములు; దానికి ఫలితముగ మనదేశ మా విషయమున వెనుకఁబడిపోయినది; విశాల మయి, ఫలవంతమైన మనదేశమున వాణిజ్యోప జీవులు వ్రేళ్లపయి లెక్కింపఁదగి యున్నారు. వాణి జ్యము నీచమను దురభిప్రాయమును పోగొట్టుటకీ గ్రంథము మిగుల ఉపయోగకారి.

చరిత్ర విదేశీయులదైనను, శ్రీ శేషగిరిరావుగారి రచనాలాలిత్యమున అది అత్యంతము ఆకర్షణీయ మయి, ముందటి చరిత్రమును చదువుట కుత్సా హము కలిగించుచున్నది. ఇట్టి రచనలలో ఆరి తేఱిన శ్రీ శేషగిరిరావుగారినిగూర్చి విశేషించి చెప్పఁబనిలేదు.

ఇది "వాణ్యపూజ్యు"లలోని మొదటిభాగము. ఇంకను మఱికొన్ని చరిత్రములను రచింప శ్రీ శేషగిరిరావుగారి సంకల్పము: పాశ్చాత్యుల చరిత్ర వలెనే భారతీయులగు వాణిజ్యపూజ్యుల చరిత్రమును గూడ శ్రీ శేషగిరిరావుగా రొక భాగముగఁ బ్రకటిం చినచో మనవారికి వాణిజ్యమునెడ గౌరవమర్యాద లధికమయి, వాణిజ్యము, తన్మూలమున దేశము నభి వృద్ధిపొందుటకు సదవకాశములు లభింపగలవు.

బి. వేం రమణయ్య

## ప్రత్యూష

పద్య సంకలనము. కర్తలు: వివిధ రచయి తలు. సాధనసమితి ప్రచురణము, హైదరా బాదు, ఫెబ్రవరి, ౧౯౫౦.

కిలన్నొ. రా

తెలంగాణాలోని నవకుమారుల కవిత్వసంపదకు మచ్చుతునకలైన పద్య, గేయాల సంపుట మిది. ఇందులో రకరకాలయిన విషయాలకు సంబంధిం చిన ఖండికలు ఆయా విషయాల్లో రచయితలకి వున్న శక్తిసామర్థ్యాలని తెలియజేస్తూ వున్నాయి. ఇదివరకు నవ్యకవుల పక్షంలో వెలువడిన "వైతాళి కుల" పద్ధతిని సంపుటం వెలువరించడంకోసం హైదరాబాదు సాధనసమితి ప్రయత్నాలు చేసి, "ప్రత్యూష" ప్రకటనమూలంగా కృతకృత్యత పొందింది. "సాధనసమితి" సంకల్ప సూర్యోద యానికి ఈ "ప్రత్యూష" ప్రత్యూషం కాగలదని భావించవచ్చు.

ఇందులో ఇరవై ఎనమండుగురు కవులు రచించిన యాభైయారు రచన లున్నాయి. హైదరా బాదు రాజ్యంలో ఆంధ్రోద్యమానికి పితామహులైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారు దీనికి "పీఠిక" వ్రాస్తూ సమితిని ప్రోత్సహిస్తూ దీవించారు. విశేషించి దీనిలో గ్రంథంచివర ఆయా రచయితల జీవిత సంగ్రహం చేర్చబడింది. అది కేవలం వ్యక్తి చరిత్రనే కాకుండా, ఆయా వ్యక్తుల విశాల హృదయాన్నీ, ఉదారాశయాలనీ వెల్లడిస్తూ కవి జీవితరచనలో ఒక కొత్తమార్గాన్ని తొక్కింది. ఇది చాలా మెచ్చదగినది.

"ప్రత్యూష"లోని రచనలని ప్రత్యేకంగా పేర్కొన డం కంటె ఒక పద్యాన్నే మచ్చుగా చూపడం చాలు; అదీ ఏర్చినది కాకుండా యథాలాభంగా కన బడ్డది.

"భారత మాతృగర్భమున
బల్లెము గ్రుచ్చిన దుందగీంద్ర కా
దారముగా నిజాంనృపతి
తాళముతీసిన పెద్దపెద్ద బం
గారపుబొక్కసాలు పని
గట్టెను తెల్లదళారి; అంతలో
బేరముషారైె; పోరు జరి
పింపతుపాకులు దింపుకోసమై"

తెలంగాణాలోన దావాగ్ని లేచి చుట్టుముట్టిన భీకరదినాల కాలంలో ఉడుకెత్తిన రక్తంతో కవి కుమారుడు రచించిన పద్యమిది. ఇలాగే యిందులోని రచనలన్నీ భావగర్భితాలై యువకుల హృదయాలని ఆకర్షించగలిగి ఉన్నాయి. కవికుమారులందరూ, భాషా వాఙ్మయాభిమానులందరూ చదవదగిన దీ "ప్రత్యూష." "సాధనసమితి" ఇలాటి రచనలకి ప్రోత్సాహ మిస్తూ భాషా వాఙ్మయసేవ చేయగలదని నమ్మిక ;

బి. వేం. ర.

# మాయింట్లో

రచన : శ్రీధరణికోట శ్రీనివాసులు
సాధనసమితి, హైదరాబాదు, వెల 8 అణాలు.

ఇందులో "ముద్దులమూట" మున్నగు కథలు ఎనిమిది ఉన్నాయి. అన్నీ సంసారానికి సంబంధించినవే. శ్రీ మునిమాణిక్యంవారి అడుగుజాడల్లో నడిచి, సంసారపు గొడవలని చిత్రిస్తూ కథలు రాయాలని గ్రంథకర్త ఉద్దేశం. మునిమాణిక్యంగారి "కాంతం" లాగే వీరి "కనకం" కథావాఙ్మయంలో ప్రముఖపాత్రను వహించాలని అభిప్రాయమేమో ; పేరేమో బాగానే వుంది; కాంతాకనకాలని రెండిట్నీ జతకూర్చే పదూ మనవాళు వివిధ విషయాల్లో పేర్కొంటారు.

ఇందులో వున్న కథలన్నీ యిదివరకు "గోలకొండపత్రిక" "శోభ", "ఆనందవాణి", "ఉషస్సు" మొదలైన పత్రికల్లో ముద్రితాలయి శ్రీధరణికోట వారికి సాంసారిక హాస్యకథానికా రచయితల్లో సుపరిచయం సంపాదించినట్లు సమితి కార్యదర్శి "స్వీయోక్తి". సమితివారే ఆ కథల్ని గ్రంథరూపంగా ప్రచురించారు. దీనికి ఆదర్శమూర్తులయిన శ్రీ మునిమాణిక్యంవారు దీనికి "మున్నుడి" వ్రాశారు. ఆయన—"ఈ కథలు ఈ రచయిత యొక్క కృషికి ప్రథమ ఫలాలు—తొలికాపు.

దోరపండ్లలో వుండే కమ్మదనమూ, ముద్దుపలుకుల్లో ఉండే మాధుర్యమూ, ఈ శ్రవ్యదృశ్యాలలో ఉన్నవి" అంటూ యోగ్యతాపత్రం యిచ్చారు.

అయితే దోరపండ్లయితే కమ్మదనమూ, అదీ వుండవచ్చు. కసరుపిందెలకి అది రావడం కష్టం ; అభిమానంకొద్దీ ఉన్నదని అనుకొని, తృప్తిపడడం ఆత్మవంచన అవుతుందేమో ;

ఉన్నదున్నట్లు వ్రాసినంతమాత్రంలో ఏరచనా హృదయంగమముగా ఉండదు. కావ్యవాఙ్మయంలో ఏ భాగానికిన్నీ చమత్కృతే ముఖ్యలక్షణం. ఇందులోని కథానికలన్నీ ఒక జరిగిన సమాచారాన్ని చెప్పినట్లున్నాయే గాని ఆకర్షకంగా లేవు.

కాంతంకథలకీ, వీటికీ చాలా తేడా వుంది. సంసారంలో ఎలాటి ఒడుదొడుకులని వర్ణించినా వాటిని చదివితే చివరకు "ఫరవాలేదు. సంసారం సాగింపదగ్గదే!" అని తోస్తుంది; ఆనందమూ కలుగుతుంది. ఈ కథలు చదివితే "ఎందుకొచ్చిన సంసారం బాబూ; చాలు; చాలు; దీన్ని వదులుకొని సన్యసిస్తే మేలు" అనిపిస్తుంది. చికాకు కూడా కలుగుతుంది.

సాహిత్యానికీ, నీతికీ, ముడిపెట్టకూడదంటూ అధునాతనుల అభిప్రాయం; మనం కోరి ముడిపెట్టకూడదని అన్ని తరగతులవారూ అంగీకరిస్తారు. కాని అలాటి వాఙ్మయం చదివినందువల్ల కలిగే మనోభావాల్ని అటంకపరచడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఈ రహస్యం ఎరిగిన రచయిత తన రచన సాగించడంలో చాలా జాగ్రత్త తీసుకుంటారు. ఈ ఈ కథలలో రచనాచమత్కృతి మృగ్యం కావడం వల్ల ఆకర్షకత కొఱవడి ఉందని చెప్పవలసి వస్తున్నది.

శ్రీ మునిమాణిక్యంవారు చెప్పినట్లు యీ కవి యింకా మంచి కృషిచేసి, "ఇంకా పుష్టినీ, రసాన్ని రమణీయమైన ఆకృతినీ, మాధుర్యాన్నీ సేకరించుకొన్న పరిపక్వమైన కథాఫలాలు అందించగలరని "మనం ఆశించవచ్చును"

బి. వేం. ర.
కె. [illegible]

# పెంగ్విన్ ప్రచురణలు

మంచి పుస్తకాలు అందరూ చదువవలసిందే. కాని పుస్తకము బాగుండి ఆకారమూ చాలా ఆకర్షణీయంగా ఉండాలంటే అంత ఖరీదు ఇచ్చి కొనడం అందరికీ వీలు కాదు. అంచేత మంచి పుస్తకాలని కొన్నిటిని చక్కగా అచ్చువేసి అందరికీ అందుబాటులో ఉండే ధరలకు అంద జేస్తూ Penguin వారు చేస్తూన్న ప్రజాసేవ అమోఘము. నవలలూ, ప్రఖ్యాత పురుషుల జీవిత చరిత్రలూ ఇత్యాది గ్రంథాలు సాధారణ కాగితాలపై అచ్చువేస్తూ లలితకళల సంబంధమైన విషయాలను గురించిన పుస్తకాలను అందమైన ఆర్ట్ పేపర్ పైన "King Penguin Books" అను పేరట ప్రచురిస్తున్నారు వీరే. ఇవి ముద్రణ విషయంలోనూ, ఆకారం విషయంలోనూ, ఉత్తమశ్రేణికి చెందినవైనా వెలమాత్రము అట్టే ఎక్కువ కాదు కాబట్టి ఇదివరకు లలితకళలలో తగిన ఆసక్తి కలిగించుకో దానికి ఆర్థిక రీత్యా అంత అవకాశము లేనివారు సైతము ఈ పుస్తకాల ద్వారా ఎంతో ఆసక్తి కలిగించుకొని అభిలాష అభివృద్ధి చేసికోగలరు.

ఈ ప్రచురణలలో ఇటీవల వచ్చినవి The Cinema 1950. అనే విమర్శా గ్రంథం ఒకటి. Romney Marsh అనే King Penguin ఒకటి.

### THE CINEMA 1950

ది సినీమా 1950. సంపాదన : రోజర్ మాన్వెల్ (Edited by Roger Manvel) ప్రచురణ : Penguin Books, Harmondsworth, Middlesex, England. సైజు : $4\frac{1}{2}" \times 7"$ పుటలు : 224. ఫోటో చిత్రాలు : 120 (64 పుటలు) వెల రెండున్నర షిల్లింగులు.

నాటక రంగానికి కొంత చేయూతగా, కేవలమూ ఒక వినోద కలాపంగా, ప్రారంభించిన సినీమా పరిశ్రమ జరిగినదేశాలలోనూ విపరీతంగా అభివృద్ధి పొంది ప్రపంచంలో ఇంచుమించు అన్ని దేశాలలోనూ, పారిశ్రామికంగా ఆర్థికంగా, ఎంతో ప్రబలి, ప్రజలలో కళావికాసానికి ఎంతో తోడ్పడుతోంది. ముఖ్యంగా, మన దేశంలో జనుల వేష భాషలపైనా, ఆచార వ్యవహారాలపైనా, కళా సంపద పైనా, వ్యాపార విషయాలపైనా కూడా సినీమా పరిశ్రమ ప్రాబల్యము నానాటికీ అధికమౌతోంది. ఇళ్ళల్లో, ఒక క్రొత్త పాట వినబడితే "ఇది ఏ సినీమాలోదీ?" అనే ప్రశ్నే. అమ్మాయికి క్రొత్తగా లోలకులు చేయిస్తే "ఫలానా సినీమాలో ఫలానా నటి అలంకరించుకున్నవి కావూ ఇవి?" అని తక్షణం విమర్శ. ఇక వస్త్రధారణ విషయంలో సినీమా ఫాషన్లు మనవారిని నిమిష నిమిషమూ ఎంతగా ఆకర్షిస్తున్నాయో అనుభవించినవారికే తెలుసు. అంచేత, కొంతవరకు మన దేశంలో, ఇంకా ఎంతో ఇతర దేశాలలోను, సినీమా ద్వారా జనుల భావాలూ, అభిప్రాయాలూ, కొంత ప్రస్ఫుటంగానూ కొంత అప్రస్ఫుటంగానూ మారిపోతున్నాయి అని గుర్తించక తప్పదు.

ఇటువంటి ప్రాబల్యం గల సినీమా మహా ప్రవాహాన్ని సమీక్షిస్తూ, అందచందాలని పరీక్షిస్తూ, విలువ కడుతూ, క్రొత్త విలువలని తెలియజేస్తూ ఎంతో అందంగా అమరింది. The Cinema 1950. Penguin Film Review అను పేరట ఇంతవరకూ చదువరుల మన్ననలను చూరగొన్న పత్రిక స్థానే ఈ విమర్శ ఇకమీదట ఏటేట వెలువడగలదని ప్రకాశకుల ప్రకటన. ఫిల్మును గురించి కొందరు గొప్పవారు ఇదివరలో వ్రాసిన వ్యాసములు, నిపుణులైన నవీనులు వ్రాస్తూన్న వ్యాసములు సేకరించి చదువరులకు అందజేయవలెననే ఉద్దేశ్యంతో ఇందు ఎన్నో విలువగల వ్యాసాలు విపులంగా ప్రచురించారు. సినీమా కళనూ, సినీమా పరిశ్రమనూ వివిధ దృక్పథాల నిశిత దృష్టితో పరిశీలిస్తూ, దేశదేశాలలో జరుగుతూన్న సినీమా అభివృద్ధిని గురించి కళ్ళకు గట్టినట్లుగా వర్ణించారు. సినీమాకు సంబంధించిన

కొత్తకొత్త గ్రంథాలను గురించి ఇందు పాతిక పేజీ లున్నాయి. సినీమాను గురించి ఇంకా ఇంకా వివరంగా తెలుసుకోవాలి అనేవారి ఉపయోగార్థము కొత్త పుస్తకాల పట్టిక ఒకటి, ఇతర దేశాలలో వెలువడిన కొత్త Feature Films పట్టిక ఒకటి— ఇవన్నీ ఈచిన్ని పుస్తకానికి ఒక మహాగ్రంథపు విలువను చేకూర్చినవి.

ఇటలీ దేశంలో తయారైన కొత్త ఫిల్ములూ, ఫ్రాన్సు, సోవియట్ రష్యా, జెకోస్లవాకియా, పోలండ్, జర్మనీ దేశాలలోని ఉత్తమ చిత్రాలు, మెక్సికోలో తయారై ఐరోపీయ ప్రదర్శనాలలో బహుమతులు పొందిన చిత్రరాజములూ, అమెరికన్ ఫిల్ములు కొన్ని, ఆస్ట్రేలియా, ఆఫ్రికా ఖండాలకు చెందిన ఫిల్ములు కొన్నీ, బ్రిటిష్ ఫిల్ములు కొన్నీ, వీనిని వర్ణిస్తూ చాలా అందమైన బొమ్మలు ఇందు ఉన్నవి. మనదేశంలో తయారై, ఖండాంతరాలలో ఖ్యాతిగాంచిన ఉదయశంకర్ "కల్పన"ను వర్ణించే అతి రమణీయమైన పటాలు నాలుగు సరిగ్గా పుస్తకం మధ్య ఎంతో ఉత్సాహకరంగా ఉన్నాయి.

The Cinema 1950 లోని ప్రతి వ్యాసము ఒక ఉన్నత ఆదర్శాన్ని ప్రబోధిస్తూ సర్వజన ఆనంద సిద్ధికోసం ఈ ఉత్తమ కళను ఎంత చక్కగా వినియోగించుకోవచ్చునో సూచిస్తుంది. కాబట్టి ప్రస్తుతం మనవారికి ఈ గ్రంథము ఎంతో ఉపయోగకరం; అత్యవసరం.

## ROMNEY MARSH

రమ్‌నీ మార్ష్ (Romney Marsh) కర్త : జాన్ పైపర్ (john Piper). ప్రచురణ : The Penguin Books, Harmondsworth, Middlesex, England. సైజు : $5'' \times 7\frac{1}{2}''$ పుటలు : 36. ఆర్టు చిత్రాలు : 16. వెల : మూడు షిల్లింగులు.

ప్రపంచంలోకెల్లా తమ దేశమే స్వర్గమని ప్రతివారూ అనుకోవడము సహజమూ, సమంజసమూ కూడా. ఈవిషయంలో ఇంగ్లీషువారు ఇతరులతో ఏమాత్రమూ తీసిపోరు. ఇంతటి అభిమానం ఉండబట్టే ఇంచుమించు ప్రతి నెలా బ్రిటన్‌కు చెందిన ఏదో ఒక ప్రాంతపు ప్రకృతి అందమును వర్ణిస్తూ అందమైన బొమ్మలతో ఏదో ఒక గ్రంథం వెలువడుతూ ఉంటుంది. Romney Marsh అనే పుస్తకం ఇటువంటిదే. ఈ సుందర ప్రదేశము ఇంగ్లండ్‌కు తూర్పు తీరమున Kent కౌంటీ లోనిది. ఇతర ప్రాంతాలలో నవనాగరికతా ప్రాబల్యం వల్ల ప్రదేశమూ,ప్రజలూ కూడ ఎంత మారిపోయినా ఈప్రాంతం మాత్రం తన పూర్వపు అందాన్ని పోగొట్టుకోలేదని ఇచటివారు గర్విస్తారు. యుగయుగాల కాలగమనమునే మరచిపోయి నిత్యమూ నిర్మలాకాశాన్ని ప్రతిబింబిస్తూ చల్లగా నడిచిపోయే చిన్న కాలువలలో నిద్రిస్తూ కలలుగంటూ ఉన్న నల్లకలువ సమూహాలను చూచివచ్చుటకై పెన్గ్విన్ వారు పంపిన జాన్ పైపర్ అనే ఉత్తమ చిత్రకారుని అనుభవముల పరిపూర్తి ఈ అందమైన గ్రంథము. ఈ పుస్తకంలో ఆసుందర ప్రదేశము లోని వేరువేరు విశేషముల గురించి చక్కని వర్ణనే గాకుండా చిత్రకారుడు ఎంతో నిపుణతతో చిత్రించిన చక్కని చిత్తరువులు మనకెంతో ఆహ్లాదము, విస్మయము కలిగిస్తాయి. "ఎంత అందమైన ప్రదేశము!" అని ఆశ్చర్యపోతో "ఇటువంటి ప్రదేశాలు తప్పకుండా చూచితీరాలి!" అనుకుంటాము. పుస్తకాలంటే ప్రియముకలవారు "ఈ పుస్తకం ఎంత అందంగా తయారు చేశారు!" అనుకుంటారు.

# కథా రచన

౦౹౧

తూలికా భూషణ్

తెలుగు సారస్వతంలో చిన్నకథ ఇంత వరకు. ఒక విశిష్టమైన స్వరూపం, ఒక ప్రత్యేకత, ఒక అందం సంతరించుకో లేదనే చెప్పాలి. అంటే తెలుగులో మంచి కథలే లేవనికాదు.

ప్రతిజాతికీ ఒక విశిష్టత ఉంటుంది. అదే ఆజాతి సారస్వతంలో ప్రస్ఫుటం కావాలి.

ఏ సారస్వతంలో అయినా ఒక మంచి గేయానికి ఉన్న గౌరవం ఒక చిన్నకథకు ఉంది. ఒక మంచిగేయం రచించడం ఎంతకష్టమో ఒక చిన్న కథ రచించడంకూడా అంతే కష్టం.

అయితే చిన్నకథ అంటే ఏమిటి అనేప్రశ్న ఉత్పన్నం అవుతుంది. చిన్న కథ ఒక సంఘటన కావచ్చు; ఒకవ్యక్తి మనస్తత్వ పరిణామం కావచ్చు; ఒక సుదీర్ఘమైన ఇతివృత్తమే కావచ్చు. చిన్నకథలో కేవలం ఒకేప్రత్యేకత ఉంది. సాధ్యమైనంత తక్కువమంది వ్యక్తులతో, తక్కువ సంఘటనలతో అది కథ కావాలి. అంతేకాక అది స్వయం సంపూర్ణం కావాలి. అంటే కథకు ఆధారంగా తీసుకున్న సంఘటనలతో, వ్యక్తులతో చెప్ప దలచుకున్న దానిని సంపూర్ణంగా చెప్పగలిగిఉండాలి.

కథ అయినా, కారుణ్యమైనా, ఏ సాహిత్యఖండమైనా పాఠకునికి హృదయంగమంగా ఉండేటట్లు చేయాలి. దానిని చెప్పే పద్ధతి అందంగావుండాలి. అదొక కళాఖండం కావాలి.

'అనగా అనగా వొక రాజుండేవాడు.' అని ప్రారంభించగానే చిన్న పిల్లలు చెవులు రిక్కించి వింటారు. ఆ వాక్యం వారి హృదయాలమీద వెంటనే హత్తుకుంటుంది. చిన్నకథ ప్రారంభించడంలో మొదటి వాక్యంతోనే పాఠకుడు కథలో ఐక్యం అయ్యేట్లు చేయాలి. కథ కొక క్రమపరిణామము, అంతము ఉండాలి.

ఇతర సారస్వతాలలో వలెనే తెలు

గులో కూడా చిన్న కథ వొక క్రమపరిణామం పొందుతోంది.

పూర్వం తెలుగులో చిన్న కథలే లేవంటే ఆశర్యపడవలసిన పనేమీలేదు.

ప్రప్రథమంగా తెలుగులో చిన్న కథ రచించడం ప్రారంభించినది "కన్యాశుల్కం" నాటకం రచించిన గురజాడ అప్పారావుగారు.

మునిమాణిక్యం నరసింహారావు. మొక్కపాటి నరసింహశాస్త్రి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. పల్లావఝుల శివశంకరశాస్త్రి, ఇంకా తదితరులు చిన్న కథ కొక నూతన సౌందర్యం కల్పించారు.వారి యుగంలోనే చిన్న కథ మొదటిపర్యాయం అభివృద్ధి చెందింది.

ఆ రచయిత లందరూ నాటి సామాజిక జీవితంలోని సమస్యలనే ఆధారంగా చేసుకుని చిన్నకథలు రచించారు. వారానాటి పరిస్థితులను "తప్పని సరివిగా" తీసుకున్నారు. వాటిలోని లోపాలను చూపించి, హృదయ పరివర్తనం కలిగించడానికి ప్రయత్నించినవారు కొందరు. కేవలం దాంపత్యజీవితంలోని సొబగులను, ప్రణయ కలహాలను సున్నితమైన మధురహాస్యంతో మేళవించి మన కందించడంతో తృప్తి చెందాడు మునిమాణిక్యం.

అడవి బాపిరాజుగారివలె చరిత్రాత్మకమైన ఇతివృత్తాలను ఆధారంగా చేసుకుని చిన్న కథలు రచించినవారున్నారు.

చిన్నపిల్లల కథలు రచించడంలో విశేషమైన ప్రజ్ఞ చూపినది చింతా దీక్షితులు. చిన్నపిల్లల మనస్తత్వాన్ని అవగతం చేసుకొని. వారి అభివృద్ధికి దోహదమిచ్చే చిన్న కథలకు అత్యంతమైన విలువ ఉన్నది. మన దురదృష్టవశాత్తు చింతా దీక్షితులుగారు రచించినవి తప్ప చెప్పుకొనదగిన చిన్న పిల్లల కథలు తెలుగులో లేనేలేవు.

కథా సాహిత్యంలో చలం ప్రవేశంతో ఒక ఝంఝూమారుతం లేచింది. నాటి వరకు హేయంగా, పాపంగా, పశుప్రవృత్తిగా పరిగణింపబడుతూ వచ్చిన కామాన్నే కథలలో చిత్రించడానికి పూనుకున్నాడు చలం. చలం రచనలు నాటి సామాజిక పరిస్థితులపై తిరుగుబాటు. తనకు సమస్యలుగా గోచరించిన పరిస్థితులపై ఆయన మహా తీవ్రమైన పోరాటం నడిపాడు.

మానవ జీవితంలో కేవలం సుఖం కాని, కేవలం దుఃఖంకాని కరడుగట్టి ఉండదు. వాస్తవికతలో విభ్రాంతి ఏ

విధంగా మిళితమైఉందో అదేవిధంగా సుఖంలో దుఃఖము, దుఃఖంలో సుఖము అంతర్గర్భితమై ఉన్నాయి. రచయిత అయినవాడు సామాజిక పరిస్థితులను సమగ్రంగా అర్థం చేసుకొనడానికి ప్రయత్నించవలసినదే కాని, తనకు కావలసిన ఏ ఒక్క భాగాన్నో చూచి, మిగిలినదంతా తన కవసరంలేనిదని తలచరాదు. అదే చలం రచనలలోని లోపం. గద్య రచనలో చలం సిద్ధహస్తుడు.

చలాన్ని అనుకరిస్తూ కథలు రచిస్తున్నవారు నేడు లేకపోలేదు. కాని వారి రచనలలో చలం పోకడలు వినా మరేమీ లేదు.

ఆ తరువాత కథా సాహిత్యంలో ప్రవేశించిన రచయితలు చాల మందే ఉన్నారు.

ఉదాహరణకు కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్‌లను తీసుకొనవచ్చును. ఒక తరగతికి చెందిన ప్రజల జీవిత పరిస్థితులను పరిశీలించి, ఈ నాడా తరగతికి చెందినవారు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరించి చూపడానికి ప్రయత్నించాడు కొడవటిగంటి. గోపీచంద్ రచనలలో సమగ్రతలేదని చెప్పాలి.

జీవితం నేడొక తిన్ననిమార్గంలో నడవడం లేదు. సిద్ధాంతాల సంఘర్షణ, మానవత్వం అడుగంటడం, నైతిక పతనం, దారిద్ర్యం సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నానికి కారణమయాయి.

ఏ సిద్ధాంతానికి, తరగతికి చెందిన రచయితలయినా కాంక్షించేది విశ్వ మానవకళ్యాణము, సౌభ్రాతృత్వాలే. మార్గాలుమాత్రం భిన్నించవచ్చు.

సామాజిక జీవితం పూర్తిగా పతనమై అధోగతికి పోయిన ఈ స్థితిలో ఇప్పటి విలువలపై, పరిస్థితులపై, ఈ పరిణామానికి కారణభూతమైన వాటిపై తిరుగుబాటు తప్పక రావాలి.

నిర్దిష్టమయిన పరిష్కారమార్గం చూపనంతమాత్రంచేత రచయిత కాకపోడు. అయినా, జీవితంపట్ల ఆసక్తి కలిగించి, భావిభాగ్యోదయానికొక ఆశారేఖను చూపవలసినది సాహిత్యం.

సాహిత్యంలో అతి ప్రధానమయిన భాగం, పాఠకుల హృదయాలపై జీవితాంతం విస్మరించలేని ముద్ర వేయ కలిగిన బలమున్నది చిన్నకథ. అన్నిటినీ మించి చిన్నకథ రచయిత విశిష్టమయిన సృష్టిస్వరూపం.

మరొకమాట. విశ్వ సాహిత్యంలో చదువదగిన ఉత్తమమయిన కథ లెన్నో వున్నాయి. చాలాకాలంగా అట్టి కథలను తెలుగులోనికి అనువదించడం జరుగుతోంది. ఈ కృషికూడా ఇతోధికంగా జరగాలి.

# తీరిన సమస్య

శ్రీ బులుసు వేంకటరమణయ్య

అంతకుపూర్వం బిహారీలాల్ వ్యాపారం బాగానే సాగింది. కాని ఆర్థికమాంద్యం యేర్పడిన కారణంవల్ల కేవలం స్పెక్యులేషన్లమీదా, షేర్లమీదా ఆధారపడిన తన వ్యాపారం బాగా వెనకపడ్డది. అందరూ ఆయా కంపెనీల్లో తమకువున్న వాటాలు అమ్మజూపేవారేకాని కొనేవారు కనబడడంలేదు. అతనికి వస్తుందనుకునే బ్రోకరేజి స్తంభించిపోయింది తన వ్యాపారంమీద వచ్చే డబ్బే తన కుటుంబానికి మూలాధారం! పైగా తన ఆఫీసుకు అద్దే, టైపిస్టుకూ, ప్యూనుకూ జీతం, ఎలెక్ట్రిక్, టెలిఫోను ఛార్జీలూ, వచ్చిన ఘరానామనుష్యుల గౌరవార్థం అయ్యే అల్పాహారఖర్చులూ, పత్రికల్లో వేసే ప్రకటనలూ, టాక్సీ ఖర్చులూ-అన్నీకూడా తన ఆదాయంమీదే ఆధారపడి వున్నాయి. కొంత గౌరవంగా బతికినవాడవటంచేత ఒకరివల్ల మాటపడడం అతనికి కష్టం!

రెండు నెలలయింది. బొత్తిగా డబ్బు కంటపడడంలేదు. అతని ముఖంచూచి, గృహస్వామి ఆఫీసుగది అద్దెకోసం తొందరపడక పోయినా తక్కినవారు ఊరుకోరు. గత నెలలో ఫోను బిల్లుకోసమూ, ఎలెక్ట్రిసిటీ బిల్లుకోసమూ ఒక స్నేహితుడిదగ్గర అప్పు చేయవలిసి వచ్చింది. రెండోనెల బిల్లు సిద్ధంగా



వుంది. టైపిస్టు సహజ సరళహృదయం గల కాంతామణి తాను జీతం అందక బాధపడుతున్నా, యజమానినడగడంలేదు. ఇది బిహారీలాలు గ్రహించకపోలేదు. ప్యూను, అప్పుడప్పుడు అడ్వాన్సుగా, రెండూ, మూడూ తీసికుని, వుండడంచేత—అతడికి జీతం యిచ్చినట్లే అయిపోయింది. బిహారీలాల్ వ్యాపారంచూసి, మరి అడ్వాన్సు అడగడానికి వానికి బుద్ధిపుట్టక బాధపడుతున్నాడు. ఆమాంబాపతులు—మొత్తం అయిదువందలుంచేనే కాని యిక రథం సాగేటట్టు కనపడలేదు. అతను ఎంతో చికాకుపడుతున్నాడు.

బాకీలు చెల్లించడానికి గడువు మరునా డనగా—ఆ ముందురోజు అతను నిరాశా పూరిత హృదయంతో—చాలా చికాకుగా మొగం చిట్లించుకుంటూనే ఆఫీసులో ప్రవేశించాడు, బిహారీలాల్ ఆఫీసు ఒక పెద్దగది అయినా—అందులోనే తనకోసం అని కర్ర గోడలు పెట్టించి, ఒక చిన్నగదిలాగు సృష్టించుకున్నాడు, అది అతను రహస్యంగా, ఖాతాదారులతో మాట్లాడుకోడానికీ, ముఖ్యమైన రికార్డు వుంచుకోవడానికి, దానికీ పుపయోగించుకుంటాడు. టైపిస్టు ఆగదికి ఇవతల కూర్చుంటుంది. నౌకరు అవసరమైన కాగితాలతో టైపిస్టు దగ్గర్నుంచి యజమాని దగ్గరకూ, అక్కడ్నుంచి యిక్కడకూ రాక, పోకలుసాగిస్తూ వుంటాడు.

బిహారీలాలు ఎవ్వరిమొగమూ చూడకుండానే చరాచరా తనగదిలోకి వెళ్ళి సీట్లో కూచుని ఫోనులో ఎవరితోనో మాట్లాడ సాగినాడు.

"హలో! ఎవరు? రామనాథమా? క్షేమంగా వున్నావా? అవును మరి. వ్యాపారం చాలా మందంగానే వుంది. ఆ దుర్మార్గుడు నరేశను పోటీ ఎక్కువగా వుంది—ఎవడా? ఎరగవూ? అప్పుడు నిన్ను మోసంచేసి—బ్యాంకు వ్యవహారాల్లో నీ పీకమీదికి తెచ్చేడే! వాడు! వాడిని అధఃపాతాళానికి అణచివెయ్యడానికి మార్గం వుంది! నాసంగతి నీకు తెలుసు. ఇదివరకల్లా బ్యాంకివాటాల వ్యవహారంలో మీకు ఎంత లాభం చూపించినదీ మరవలేదనుకుంటాను. నాకు ఒక్క వుపకారం చెయ్యాలి! ఈరోజే! అయిదువందలు మాకంపెనీ సెక్యూరిటీమీద అప్పు మీబ్యాంకులో యిస్తే నాలుగయిదు రోజుల్లో సెటలు చేస్తాను. ఏమి? ఏజెంటు ఆఫీసుకు రాలేదంటున్నావా? నువ్వు మేనేజరువుకదా: అంత సాహసం లేదంటావా? పోనీలే; అట్టే శ్రమపడనక్కర్లేదులే."

మళ్లీ రింగప్‌చేసి మరొకరితో మాట్లాడుతున్నాడు. "హలో! జ్వాలా బ్యాంకేనా యిది? ఎవరు మాటాడుతున్నది? జీవనలాలా? నమస్కారాలు! ఎప్పుడు అజమీరు ప్రయాణం! వెళ్లే ముందు మాయింట ఆతిథ్యం గ్రహించి వెళ్లాలి. ఏమి? తిరిగిరావడానికి రెండు నెల్లవుతుందా? నావ్యాపారం మంచి ప్రోగ్రెస్‌లో వుంది. ఇప్పుడొక వుపకారం చేసిపెట్టాలి! ఈ సాయంకాలంలోగా అయిదు వందలు కావాలి! నాలుగు రోజుల్లో యిచ్చేస్తా! ఏ సెక్యూరిటీ అయినా సరే! మాకంపెనీ సెక్యూరిటీమీదే యియ్యవచ్చు. వీలయితే రేపే యిచ్చేస్తాను! కంపెనీ సెక్యూరిటీలమీద అప్పులివ్వడం లేదంటావా? ఉపకారం చెయ్యలేకపోయేనని విచారిస్తున్నావా? పోనీలే; నువ్వేం చేస్తావు?"

మరోసారి రింగప్ చెయ్యబడింది. "హలో! ధనపాల్ గౌండర్‌గారున్నారా?". ఏమీ! తమరేనా! నమస్కారాలండి! నేను, బిహారీలాలుని; మీ దయవల్ల — తమరేముహూర్తాన మా సంస్థ ప్రారంభించారో, చాలాజయంగా వ్యాపారం సాగుతున్నాది.విశేషమేమిటంటే—ఇండియన్ బ్యాంకి షేర్లు పది అమ్మకానికొచ్చాయి. కొంచెం ప్రయత్నిస్తే చాలా లాభంగా కొట్టివేయవచ్చును. రేపు ఆ విషయం పూర్తిగా తెలియజేస్తాను. ప్రస్తుతం

తమవల్ల ఒకా వుపకారం జరగాలి. అర్జంటుగా అయిదువందల రూపాయిలు కావలసివుంది. రెండురోజుల్లో యిచ్చివేస్తాను. మీరు అంగీకరిస్తే మా కంపెనీ సెక్యూరిటితో ప్రోనోటు వ్రాయించి తెస్తాను.

నిన్ననే యిచ్చేశానంటున్నారా ? మీరు తలచుకుంటే యిది తమవంటి వారికొక లెక్కకాదు. ఇంతకీ నా అవసరం యిలాటి సమయంలో వచ్చిందిగనక—రెండు రోజులు తాళమన్నారా ? రెండురోజుల తర్వాత నేనే కావలసినంత సొమ్ము యితరులకిచ్చే స్థితిలో వుంటాను. "సారీ !" అంటున్నారా ! మీరు విచారించవద్దు.

ఇంతలో కాంతామణి వచ్చి "మీకోసం యెవరో ముగ్గురు తగు మనుషులువచ్చి చాలా సేపట్నుంచీ కాచుకుని వున్నారు" అని చెప్పింది. బిహారీలాలు చికాకుతో "అయిదు నిమిషాలపాటు ఆగమని చెప్పు" అని సమాధానం చెప్పేడు. ఆమె వెళ్లిపోయింది.

మళ్ళీ ఫోనులో మాటలాడసాగాడు—"హలో ! చలం ! గుడ్‌మార్నింగ్ ! ఈ సిటీ ఇంప్రూవ్‌మెంటు స్కీమునుబట్టి నువ్వు కుబేరుడవయ్యేటట్టున్నావు ! ఇంతకీ అదృష్టవంతుడివోయ్ ! ఇచ్చిపెట్టినవాడు యింజనీరన్నాడు ! మాయింటికోసారి రారాదూ ! ఆదివారం తప్పక వస్తానంటున్నావా ? తప్పక రావాలి ! నా వ్యాపారం బాగానేవుంది. కాని ప్రస్తుతం వక వుపకారం చెయ్యాలి నీవు ! అర్జంటుగా ఐదువందలు కావాలి ! ఈలోపునే యిచ్చేస్తాను. లేదా—" ఆదివారం నువ్వు వచ్చినప్పు డిచ్చేస్తాను. ఏమంటున్నావు ? నీకుయిచ్చిన అడ్వాన్సు కూలీలకీ, కలపకీ వాటికీ చాలదనేనా ? ఆ ప్తమిత్రుడి కీపాటి వుపకారం చెయ్యలేవని నేననుకోలేదు. మూడురోజులుపోతే, నేనే యిస్తాను నీకు కావలసినంత సొమ్ము !'

బిహారీలాలు మరి ఫోనులో ఎవరితోనూ మాటలాడలేదు. చాలా చికాకులో వున్నాడు మనిషి !

## 2

బిహారీలాలు తన సీటులో వుండే వెనక్కి తిరిగి, టైపిస్టువేపు చూస్తూ "మిస్ మణీ ! పెన్సిలూ, నోటుబుక్కూ పట్టుకుని యిలా వకసారి వస్తావా !" అన్నాడు.

ఆమె లోపలికి వెళ్ళి టేబిలుదగ్గర—అతనికెదురుగా వకకుర్చీలో కూర్చుని, నోట్సు తీసికోడానికి సిద్ధంగావుంది.

లాలు చాలా చికాకుగా వున్నాడు.

"చూడూ ! నేషనల్ కమర్షియల్ బ్యాంకిలోవున్న మన ఎక్కౌంటుని వెంటనే క్లోజు చేసి, దాన్ని ఇండియన్ బ్యాంకుకు మార్చాలి."

కాంతామణి దాన్ని వ్రాసుకుంది.

"జీవనలాలు తనజాతివారికి ఏమీ వుపకారం చేయక—సెక్యూరిటీలమీద అప్పులివ్వక....బ్యాంకుకు అపారమైన నష్టం కలిగిస్తున్నాడని జ్వాలా బ్యాంకు హెడ్డాఫీసుకు జాబు వ్రాయాలి."

ఆమె దానినీ నోటు చేసుకుంది.

ధనపాల్ గౌండరు చట్టానికి విరుద్ధంగా రహస్యంగా పల్లెల్లో బట్టీలుపెట్టి దేశీయసారాయం తయారుచేస్తున్న సంగతి బయలుపెట్ట దానికి ఒక 'ఆకాశరామన్న వుత్తరం సృష్టి చెయ్యాలి''

ఆమె అతనివేపు చూసింది, యిది మన కెందుకూ? అనే అభిప్రాయంతో.

"కాదు, మణీ! ఘనం అబద్ధం చెప్పడం లేదు. ఇలా చేస్తే మనం దేశానికి వుపకారం చేసినవారమౌతాము!''

ఆమె మరేమీ చెప్పలేదు.

మరో చిన్నజాబు వ్రాయాలి. అడయారులోవున్న యింజినీరు చలానికి: వచ్చే ఆదివారం నేనింట్లో వుండననీ, ఎంత మాత్రమూ రావద్దనిన్నీ''

"ఇక సరా,'' అనే అభిప్రాయంతో కాంతామణి చూచింది.

ఈరోజు కివి చాలును. ఎంత యత్నించినా మన కిప్పుడు చుక్క ఎదురవుతున్నాది: నీ శాంతానికి నాకే ఆశ్చర్యమవుతున్నాది ''

ఆమె చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"నీవు వెళ్ళి ఆ పెద్దమనుషులని ఇటు పంపించు; జాబులు టైపుచేసి సిద్ధంగా వుంచు. బహుశా బాకీదార్లే మో! వీళ్ళంతా నన్ను యేం చెయ్యగలరో చూస్తాను" అన్నాడతను.

కాంతామణి చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. ఆగతుమనుషులు ముగ్గురిలోనూ, యిద్దరు ముందు లోపలికి వచ్చారు. అపుడు మూడో అతను, చేతిలోని ఛాయాగ్రాహక యంత్రంతో ఏమో ఫోటోలు తీసి, అవలీలగా, తన మిత్రుల్ని కలుసుకున్నాడు. అతను వచ్చే వరకూ—ఆ ప్రయివేట్ ఛేంబరు తలుపు తెరచే వుంది.

బిహారీలాలు చాలా సీరియస్‌గా వున్నాడు.

వింతల్లో వింత ఏమిటంటే—ఆ వచ్చిన వాళ్లు అప్పులవాళ్లు కారు, అతనికి శుద్ధ అపరిచితులు కూడాను.

అతను పెద్ద వ్యాపార దృష్టితో "ఏమిటి సంగతి?'' అనే అభిప్రాయంతో వారి వేపు చూశాడు.

వారిలో పెద్ద యిలాగన్నాడు. "అయ్యా! క్షమించాలి! మేము మీవద్దకు వచ్చిన పనిని మీకు తెలుపకముందే నెరవేర్చుకున్నాం" అన్నాడు.

లాలు ఆశ్చర్యపొయ్యాడు.

"సంగతి యిదీ! మేము ఒక గొప్ప ఫిలుము తీస్తున్నాం. అందులో ఆర్థిక మాంద్యం వల్ల చాలా చికాకు పడుతూ, ఎన్నెన్నో ప్రయత్నాలుచేస్తూ విఫలుడవుతూవున్న ఘరానా మనిషిని—అతని ఫీలింగ్సుతో కూడా ఫోటో ఎత్తడానికి విశ్వప్రయత్నాలు చేశాం. మా నటకులు ఎంత చాతుర్యం చూపినా నచ్చలేదు. అస్వాభావికంగానే వుంది! క్షమించాలి! మీరిలాంటి స్థితిలో-ప్రస్తుతం సుమండీ!—వున్నట్లు అతిప్రయత్నంమీద తెలుసుకున్నాం. మీ టైపిస్టును కనుక్కోగా నిజమేనని చెప్పింది. మీ

దర్శనం లభ్యమయే సమయం ఆమెవల్ల తెలుసుకున్నాం. తర్వాత మీ దర్శనం! మీ ఫోటోను అప్పుడే తీసుకున్నాం. మీ అంగీకారం తీసుకున్న తర్వాత—ఫొటో తీస్తే— అదికూడా అస్వాభావికంగానే వుండిపొయ్యేది. అంచేత ముందు చెప్పలేము. క్షమాపణ."

బిహారీలాలు ఆశ్చర్యంతో చూసేడు.

"మీవల్ల మేం పొందిన యీ మహోపకారానికి ప్రతిఫలంగా యీ బహుమానాన్ని గ్రహించండి" అంటూ వంద రూపాయిల నోట్లు అయిదు టేబిలుమీద పెట్టాడు.

బిహారీలాలు ముఖం చేటంత అయింది. అతను తన్నే నమ్మలేక పొయ్యాడు!

ఆ వచ్చిన తగుమనుష్యులకి కృతజ్ఞత తెలుపుతూ, సాగనంపాడు. లాలు.

"కాంతామణీ! ఎంత గడుసుదానివి! తెలిసుండికూడా, నాకు చెప్పవైతివే! నీ తెలివితేటలకి చాలా ధన్యవాదాలు! ఎలాగయితేనేం? మన సమస్య తీరిపోయింది. ఇక ఫర్వాలేదు. ఇదే శుభసూచకమనుకో! అంటూ, ఆమె కివ్వవలసిన రెండు నెలల జీతం—ఒక నోటు ఇచ్చివేశాడు.

"చూడు! ఇందాకటి జాబులు పైపు చేశావా?"

"లేదు"

"అయితే ఆ నోటుబుక్కు యిలా ఇయ్యి" అంటూ, దాన్ని తీసుకుని, అందులోని నోట్సు కాగితం లాగి, నవ్వుతూ చింపివేశాడు.

ఇలా జరుగుతుందని మిస్. మణికి మొదటే తెలుసు.

---

# బీర్బల్ సహాని

శ్రీ ఎ. వి. ఎస్. రామారావు

శాసనాలను గూర్చి తరచు వింటూనే యుంటాం. నాగరికత గల ప్రతి దేశంలోనూ శాసనసంపదను కాపాడడానికి ప్రవీణులతో కూడిన శాఖ యొకటి ప్రత్యేకంగా ఉంటుంది. ప్రాచీనకాలంనాటి దేశ చరిత్రను తెలిసికొనుటకై శాసనాలు ఎక్కువగా ఉపయోగపడతాయి.

శాసనాలు కేవలం మానవ నిర్మితాలు. లిపిని సృష్టించుకొని శిలలపైనా, లోహాల రేకుల పైనా అక్షరాలు చెక్కడాన్ని నేర్చుకొనిన పిమ్మటనే శాసన నిర్మాణం మానవునికి సాధ్యమైంది. భూగర్భంలో, మానవుని ప్రమేయం లేకుండా కేవలం ప్రకృతియే కల్పించిన శాసనాలు మరికొన్ని ఉన్నాయి. ప్రాచీన కాలంనాటి రాజుల చరిత్రలను, వారిచ్చిన దాన ధర్మాల వివరణాన్ని వారి కాలంలోని ఆచార వ్యవహారాన్ని ఈ శాసనాలు తెలియ చెప్పవు, ఆ విషయాలను తెలిసికొనుటకు కూడ అవి ఏ విధంగాను తోడ్పడవు. పోగా, ప్రాచీన కాలంనాటి భూ, వృక్ష, జంతువుల స్థితిని, అవి పరిణామము పొందిన రీతిని విశదపరచుటకే ఇవి ఉపకరిస్తాయి. ప్రకృతి కల్పించిన యీ శాసనాలకు Fossils అని పేరు.

ప్రకృతిలో Fossils రెండు రకాలుగా

కి న్నె ర



ఏర్పడుచున్నాయి. చాలకాలం క్రిందట ఏదైనా వృక్షంగాని, పక్షిగాని, జంతువుగాని, మనిషిగాని భూమిపై పడి, వాటిపై మట్టి, రాళ్ళు కప్పుపడి పోయినపుడు, నాటి ముద్ర ఆ భాగంలో ఏర్పడుతుంది. ఆ ముద్ర చుట్టు మట్టి కవచ మొకటి యేర్పడుడచేత ఎండకీ వానకీ, గాలికీ తేమకీ ఆ భాగం లోనుకాదు కాబట్టి ఆ ముద్ర సాధారణంగా ఎన్నటికీ చెరిగిపోదు. భూగర్భంలో Fossils ఏర్పడుటకు అదియొక విధానం.

భూగర్భంలో Fossils మరియొక రీతిగా కూడా ఏర్పడతాయి. భూతకాలంలో ఎన్నడో జంతువో, చెట్టో చనిపోయో, పడిపోయో, —ఏదో కారణంచే భూపతనం కాగా, క్రమంగా మట్టి యిసుక పడి, కాలం గడిచిన కొలది మిక్కిలి దళమైన పటల మొకటి వాటిపై ఏర్పడుతుంది. ఆరీతిగా జంతువు లేక వృక్షము చుట్టూ గాలినీ. తేమనీ చొర నీయని దళమైన మట్టి పొర యేర్పడుటచే అవి అంత త్వరగా శిథిలం కావు. కాని కలకాలం భూగర్భంలో అవి అల్లే ఏవిధమైన మార్పూ పొందక యథాస్థితిలో ఉండుట అసంభవం. కాగా, కొంత కాలానికి వాటిని పరివేష్టించి యున్న మన్ను లేక ఇసుక రేణువులు వాటి యందలి ద్రవ్యకణములను కణమునకు కణముగా క్రమంగా ప్రతినిధానము (Replace) చేస్తాయి. తత్ఫలితంగా ఆ జీవుల శిల లేక మట్టి ప్రతిరూప మొకటి భూగర్భంలో ఏర్పడుతుంది. భూమిని జాగ్రత్తగా త్రవ్వినట్లయితే అట్టి ప్రతిరూపాలు దొరుకుతాయి. ఇట్లేర్పడిన Fossils ను Petrifactions అని ప్రత్యేకంగా పేర్కొంటారు.

Fossils లో ప్రాచీన యుగములనాటి జంతువులకు సంబంధించినవీ, పక్షులకు సంబంధించినవీ, చెట్లకు సంబంధించినవీ క్రిమికీటకాదులకు సంబంధించినవీ అనేకం ఉన్నాయి. ఫాసిల్సు మీది చెట్లకు ఫాసిల్ చెట్లనీ, ఆ చెట్లను గూర్చిన శాస్త్రానికి Fossil Botany లేక Paleo-botany అని పేర్లు.

Peleo-botany వలన ఉపయోగాలు చాలా ఉన్నాయి. దాని సహాయంతో అనాదినుండి వృక్షజాతి ఏవిధమైన పరిణామానికి లోనైందో అరయవచ్చు. భూగర్భమందలి పొరలు ఏవి ఎప్పుడు ఏర్పడినాయో ఎక్కువ నిర్దిష్టంగా చెప్పవచ్చు. తన్మూలంగా భూగర్భ మందలి ఖనిజ సంపద ముఖ్యంగా నూనె, నేలబొగ్గును గూర్చి తెలిసికోవచ్చు. అతి ప్రాచీన కాలం నాటి ప్రపంచపట మెట్లుండేదో, ఆనాటి భూగోళ స్థితి ఏరీతిగా ఉండేదో అరయవచ్చు. అప్పుడప్పుడు ఖండాలను ఖండాలను మార్చి వేసేటంత తీక్ష్ణతతో సంభవించే భూమ్యాంతర్గత చలనములతో (Earth's movements) సహా భూపటల రచనను అర్థం చేసికోవచ్చు.

భారతీయులలో Paleo-botany లో గొప్ప కృషి చేసి, ఉపజ్ఞతా పూర్వకములైన తన శాస్త్ర పరిశోధనలచే ప్రపంచ ప్రఖ్యాతుడైన విజ్ఞాన విశారదుడు డాక్టర్ బీర్బల్ సహాని.

౨

డాక్టరు సహాని శాస్త్రపరిశోధనలు, వృక్షశాస్త్రంలో వివిధ రంగాలకు విస్తరించియున్నా Paleo-botany లో చేసిన పరిశోధనల వలననే ఆయన కీర్తి దిగంత విశ్రాంతమైంది.

కేంబ్రిడ్జిలో చదువుకున్న సమయంలోనే వృక్షశాస్త్ర పరిశోధనలను చేపట్టి, ఆ ఫలితాలను ఆంగ్ల విజ్ఞాన సంచికలలో సహాని ప్రచురిస్తూండేవాడు. ఆయన శాస్త్రపరిశోధన నైపుణ్యము ఆ తొలి పరిశోధనలలోనే వ్యక్తమైందని వేరే చెప్ప నక్కరలేదు. కాని అంతలోనే paleo-botany పరిశోధన రంగము ఆయన నెక్కువగా ఆకర్షించగా, అంతవరకు చేస్తున్న పరిశోధనలను అక్కడితో కట్టిపెట్టి,



కిన్నెర

కేంబ్రిడ్జిలోనే సర్ ఆల్బర్టు సేవార్డు అధ్వర్యమున paleo-botany పరిశోధనలు ప్రారంభించేడు. ఆ పరిశోధనలో సహాని ప్రదర్శించిన కౌశల్యము, ఉపజ్ఞత సర్ సేవార్డును ఎక్కువగా ఆకర్షించేయి; సన్నిహిత భావిలో గొప్ప పరిశోధకుడుగా డాక్టరు సహాని ప్రపంచ ప్రఖ్యాతుడగునని కూడా ఆయనకు ద్యోతకమైంది. కాగా, సహానియెడ ప్రత్యేక ఆదరాభిమానాలను కలిగి అతని జీవితాన్ని తీర్చి దిద్దుటలో సర్ సేవార్డు ఎక్కువ కృషి చేసేడు.

కేంబ్రిడ్జిలో నుండగా డాక్టరు సహాని గావించిన paleo-botany శాస్త్ర పరిశోధనలలో 1920 లో ప్రకటించిన పరిశోధనా పత్రము ముఖ్యమైంది. ఆస్ట్రేలియా ఖండంలోని క్వీన్సులాండు పరగణాలో భూమిని త్రవ్వి తీసిన చెట్ల Fossils పై సహాని గావించిన పరిశోధనలే ఆ విజ్ఞాన పత్రంలో పొందు పరచబడ్డాయి. ఆ Fossils మధ్యజీవన, (Mesozoic) తృతీయజీవన, (Tertiary) కాలాలనాటివి. పరిశీలనార్థమై క్వీన్సులాండు భూగర్భ సర్వే సంఘంవారు వాటిని ప్రత్యేకంగా సర్ సేవార్డుకు పంపించేరు. సహాని పరిశోధనా నైపుణ్యమునందు తనకున్న విశ్వాసములే ఆ Fossils ను పరిశీలించుటకై సహానినే సర్ సేవార్డు నియోగించేడు. ఇక సహాని కూడ ఆ పరిశోధన కార్యాన్ని కడు సామర్థ్యంతో నిర్వహించి సర్ సేవార్డు విశ్వాసము మేరకు ప్రవర్తించేడని ఆయన మెప్పును పొందేడని వేరే చెప్ప నక్కరలేదు. ఆ పరిశోధనా పత్రాన్ని క్వీన్సులాండు భూగర్భ సర్వే సంఘంవారికి ప్రకటనార్థం పంపిస్తూ, సర్ సేవార్డు వ్రాసిన ప్రశంసా వాక్యాలే అందుకు తార్కాణం. "ఏ విషయానైనా సమగ్రంగా పరిశీలించుట సహానికి సహజం. ఆ సహజ శీలంతోనే ఆయన యీ పనిని నిర్వహించేడు. ఆ Fossils మీది మొక్కలను వర్ణించి, వర్గీకరించి, వాటి పరిశీలనలో ఏర్పడిన సమస్యలను పరిష్కరించుటలోను, విశదీకరించుటలోను సహాని గొప్ప ప్రతిభతో వ్యవహరించేడని విదిత మగుతుంది. ఆ పరిశోధన ఫలితాలను చేర్చి ఆయన రచించిన పరిశోధన పత్రాన్ని పరికించిన పిమ్మట, తనకు నియోగితమైన పరిశోధన కార్యాన్ని కడు సామర్థ్యంతో నిర్వహించేడని కొనియాడ వలసి యుంది.''

1920 లోనే "The Structure and Affinites Acmopyle Pancheri'' అనే శీర్షికతో లండన్ రాయల్ సొసైటీవారి విజ్ఞాన సంచిక—ట్రాన్సు ఏక్షన్సు ఆఫ్ ది రాయల్ సొసైటీ—లో డాక్టరు సహాని మరియొక విజ్ఞాన పత్రాన్ని ప్రచురించేడు. అదికూడా చాలా ముఖ్యమైనదే. ఆ పరిశోధనా పత్రంలో ఆయన "సతత హరితాలు''కు సంబంధించిన అనేక వివాదగ్రస్త విషయాలు చర్చించేడు.

1919 లో భారతదేశానికి తిరిగి వచ్చిన తరువాత భారతదేశమందలి ఫాసిల్ చెట్ల పరిశీలనకై డాక్టర్ సహాని పూనుకొన్నాడు. ఆధునిక శాస్త్ర పద్ధతుల ద్వారా భారతదేశమందలి ఫాసిల్ చెట్లను పరిశీలించిన వారిలో ఆయనయే మొట్ట మొదటివాడు.

19 వ శతాబ్ద మధ్యభాగంలో భారత భూతత్వ సర్వేసంఘం (indian Geologica

Survey Department)వారిచే భారతావనిలో పలుతావులను ప్రభుత్వం సర్వే చేయించినది. వారు పెక్కుచోట్ల భూమిని త్రవ్వి, అత్యంత పురాతన కాలంలో భారతదేశ వృక్ష, జంతు సంపదలను విదితపరచే ఫాసిల్‌ను పెక్కింటిని భూగర్భమునుంచి పైకి తీసేరు. అయితే వాటిని పరిశీలించి, వర్గీకరించి, ఫలితాల నరయుట ఆ రంగంలో సిద్ధహస్తులైన వారికే గాని ఇతరులకు సాధ్యం కాదుగదా! అందుచే ఆకార్యాన్ని నిర్వహించుటకై 19 వ శతాబ్దపు చివరి భాగంలో ప్రసిద్ధ విజ్ఞాని ఫీజ్ మెంటల్‌ను ఆహ్వానించి తీసికొని వచ్చేరు. ఆయన ఆ పరిశోధనలను గూర్చి దీర్ఘ కాలము పరిశోధనలు చేసి, అవి ఏకాలంనాటివో, ఆ రోజులలో భారతదేశమున వృక్షజాల మేరీతిగా ఉండేదో నిర్ణయించి "Fossils Flora of Gondwana System" అనే పుకుటంతో 4 భాగాలుగల పెద్ద పుస్తకాన్నొకదానిని ప్రచురించేడు.

ఫీజ్ మెంటల్ చేయగా మిగిలిన కార్యాన్ని ఫ్రెంచి విజ్ఞాని జీలర్, ఆంగ్ల విజ్ఞాని సేవార్డు కలిసి ఇరువదియవ శతాబ్ద ప్రారంభంలో చేపట్టి, కొంత కృషి చేసేరు. వారి తరువాత భారత దేశపు ఫాసిల్ చెట్లను గూర్చి ఇంతవరకు జరిగిన పరిశోధనల నన్నిటిని డాక్టర్ సేవార్డు, డాక్టర్ సహాని లిరువురు కలసి నూతన పరిశోధన విధానాల రీత్యా తిరిగి పరిశీలించి, ఆ ఫలితాలను indian Gondwana Plants—A REViSiON', అనే శీర్షికతో 1920 సంవత్సరములో "Palaeontaligia indica Series"లో తమ ఉభయుల పేర్లతోను ప్రకటించేరు. భారత దేశంలోని Fossil Plants ను గూర్చి సహాని పరిశోధనలు జరుపుటకు అదియే ప్రారంభము.

ఆ తరువాతి ముప్పది సంవత్సరాలలోను భారతీయ పేలియో-బాటనిలో డాక్టరు సహాని, ఆయన శిష్యులు లక్నో విశ్వవిద్యాలయ పరిశోధనాగారాలలో చేసిన పరిశోధనలు బహుళ సంఖ్యాకములై ప్రాచీన భారతదేశ వృక్షసంపదను విదితపరచుటకు ఎక్కువగా తోడ్పడినాయి.

డాక్టరు సహాని చేసిన పరిశోధనలలో ఎక్కువ భాగము గోండ్‌వానా వృక్షజాలానికి సంబంధించింది, ఆ వృక్షజాలానికి సంబంధించిన ఏ విషయంలోనైనా శాస్త్రప్రపంచ మాయననే ప్రామాణ్యంగా గైకొంటుంది. ఈ పరిశోధనల ఫలితంగా డాక్టరు సహాని కొక మహత్తర విషయం అనుభూతమైంది. ఏదైనా ఒక ప్రదేశంలోని వృక్షజాలానికిని ఆ ప్రదేశపు భౌగోళిక, భూతత్వ (జియలాజికల్) పరిస్థితులకును అవినాభావ సంబంధముంటుంది కాబట్టి ఆ ప్రదేశపు భూతత్వస్థితిని అవగాహన మొనర్చుకొనకుండా, ఆ ప్రదేశంలోని ఫాసిల్ వృక్షజాలాన్ని గూర్చి చేసిన పరిశోధనలు సమగ్రంగా ఉండవనేదే ఆ విషయం. అందు చేతనే భూతత్వ శాస్త్రమందుకూడా ఆయన గంభీరమైన పాండిత్యాన్ని ఆర్జించి, ఫాసిల్ చెట్లనుగూర్చి పరిశోధించుటకు ముందు ఆ ఫాసిల్ చెట్లున్న శిలలనుకూడ పరీక్షిస్తుండే వాడు. ఈరీతిగా "గోండ్వానా" వృక్షజాలాన్ని గూర్చి ఆయన సాగించిన పరిశోధనల ఫలితంగా ఆనాడు ఆ ప్రదేశమందున్న మొక్కలు, వాటి ఉత్పత్తి, పరిణామము, పంపకము (డిస్ట్రిబ్యూషన్) పరిసర ప్రదేశములందలి ఆ కాలపు వృక్షజాలముతో వాటికిగల సంబంధము

ఆదిగాగల అనేక మహత్తర విషయాలు స్పష్ట మైనవి.

రాజమహల్ కొండలనుండి సేకరించిన ఫాసిల్స్‌పై సహాని చేసిన పరిశోధనలుకూడా మిక్కిలి ప్రామాణ్యమైనవే.

డెక్కన్ యింటెర్‌ట్రేప్పెన్ బెడ్స్ మీది వృక్షజాలమును గూర్చి కూడా సహాని హెచ్చుగా పరిశోధనలు చేసినాడు. ఆ పరిశోధనల ఫలితాలను ఆధారంగా చేసికొని డెక్కన్ ట్రేప్స్‌కు ఆయన ప్రతిపాదించిన కాలము తీవ్రవివాదానికి దారితీసినది. ఆ తరువాత నాల్గు సంవత్సరాలవరకు ఆ సమస్యపై వాదోపవాదాలు జరుగుతునే యున్నాయి. కాని ఎట్టకేలకు, సహాని ప్రతిపాదించినట్లే, అవి అప్పర్ క్రిటెసియస్ భూతత్వయుగానికి గాక ఇయోసిన్ భూతత్వ యుగానికే చెందినవని శాస్త్రప్రపంచం ఏకగ్రీవంగా ఆమోదించింది.

పంజాబులోని "సాల్ట్ రేంజి''నుండి సేకరింపబడిన "మైక్రో-ఫాసిల్స్''ను గూర్చి డాక్టరు సహాని తన జీవితకాలంలో కట్టకడపట చేసిన పరిశోధనలు ఆ పర్వతాలను గూర్చి అప్పటికి అరువది సంవత్సరాలుగా జరుగుచున్న వాగ్వాదాన్ని సంతృప్తికరంగా పరిష్కరించేయి. 1944, 1945 సంవత్సరాలలో ఆ సమస్యా పరిష్కారార్థమై జరిగిన సమావేశాలలో భారతదేశంలోని పేలియో-బాటనిస్ట్స్ మాత్రమేగాక, ఇతరదేశ శాస్త్రజ్ఞులుకూడ పలువురు పాల్గొన్నారు. వారందరు ఆ విషయాన్ని పలుముఖాలుగా పరిశీలించి, నిశితమైన చర్చగావించి, తుట్టతుదకు ఆ విషయమై సహాని చెప్పినదానినే అంగీకరించేరన్నచో, సహాని విజ్ఞాన వైదుష్యము ఎంతగా మెచ్చుకోతగినదో మనకు విశదమగుతుంది.

## 3

బీర్బల్ సహాని పంజాబు రాష్ట్రంలో "బేడ్" అనే గ్రామమున 1891 సంవత్సరం నవంబరు 14 వ తేదీని జన్మించేడు. అతని తండ్రి రుచిరాం సహాని పంజాబు విశ్వవిద్యాలయంలో రసాయన శాస్త్రాచార్యుడుగా పని చేస్తూండేవాడు. శాస్త్రపరిశోధనలలో నిపుణుడు కాకపోయినా, శాస్త్రవిద్యాబోధనయందు ఆయనకు ఎక్కువ ప్రతిభయుండేది. పంజాబు రాష్ట్రంలో ఆధునిక విజ్ఞానవ్యాప్తికి ఆయన ఎక్కువగా కృషిచేసేడు. బీర్బల్ సహాని తల్లి ఈశ్వరదేవి పరమ పతివ్రతా శిరోమణి, గొప్ప సంస్కారిణి. పిల్లల భావిజీవితాన్ని రూపొందించుటలో తల్లిదండ్రుల సంస్కృతీ విజ్ఞానములు, పిల్లలు పెరిగిన వాతావరణము ప్రాముఖ్యమైన పాత్రను వహిస్తాయని అంగీకరిస్తే ఉన్నతాశయమండితుడై, మహా విజ్ఞానియై బీర్బల్ సహాని దీపించుటలో మనల నాశ్చర్యచకితులను గావించే దేమీలేదు!

బీర్బల్ సహాని ప్రాథమిక, మాధ్యమిక, కళాశాలా విద్యాభ్యాసమంతా విజ్ఞానప్రియుడైన తండ్రి రుచిరాం సహాని పర్యవేక్షణమున పంజాబులో చాలా ప్రోత్సాహకరంగా జరిగింది. విశ్వవిద్యాలయ పరీక్షలలో కూడ ఎల్లప్పుడు ఉత్తమశ్రేణిలోనే బీర్బల్ సహాని కృతార్థుడగుచుండేవాడు ఇక ఆయనను పరివేష్టించియున్న వాతావరణ భావంచే కాబోలు, చిన్ననాటినుండేకూడ ఆయనకు విజ్ఞానంయెడ, ముఖ్యంగా వృక్షశాస్త్రంపట్ల గాఢమైన అభిరుచి

యుండేది. తన భావి ఔన్నత్యాన్ని ఆ నా డతడు ఊహించుకోగలిగేడో లేదో కాని డిగ్రీ కోసం మాత్రమేగాక కేవలం శాస్త్రాన్ని శాస్త్రంకోసమే అభ్యసించి, అందు కూలంకష ప్రజ్ఞ నార్జించాలనే అభిలాష పిన్ననాటినుండే ఆయనకుండేది. తనకు తెలియకుండగనే తదీప్సితమునకై ఆయన కృషిచేస్తూండేవాడు ఇక రుచిరాం సహానికూడ తన తనయుడు విద్యాభ్యాసమందు ప్రదర్శించుచున్న ప్రతిభను గమనించి, అతనికి వృక్షశాస్త్రంలో ఉన్నత విద్య చెప్పించాలని కుతూహలపడ్డాడు. అందుచే లాహోరు విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట ఉన్నత వృక్షశాస్త్ర విద్యా భ్యాసానికై బీర్బల్‌ను 1911 సంవత్సరంలో కేంబ్రిడ్జి పంపించేడు. అక్కడ ఆతడు ఎని మిది సంవత్సరాలకాలం పఠించి, వృక్ష శాస్త్రంలో పరిశోధనలుచేసి, లండన్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలు రెండింటియందూ కూడ "డాక్టరేట్" పట్టాన్ని పొంది 1919 లో భారతదేశానికి తిరిగివచ్చేడు.

ఆంగ్ల విశ్వవిద్యాలయాలలో ఉన్నత పట్ట ములను పొంది మాతృదేశానికి తిరిగివచ్చిన వెంటనే కాశీ విశ్వవిద్యాలయ శాస్త్రకళాశాలలో వృక్షశాస్త్రోపన్యాసకుడుగా బీర్బల్ సహాని నియమితుడైనాడు. అయితే అక్కడ ఒక సంవత్సరంకంటె ఎక్కువకాలం ఆయన పని చేయలేదు. ఆ తరువాత వృక్షశాస్త్రాచార్యు డుగా లాహోరులోని కళాశాలలో కొద్దికాలము పనిచేసి, ఆపిమ్మట నూతనంగా స్థాపితమైన లక్నో విశ్వవిద్యాలయానికి వృక్షశాస్త్రా చార్యుని హోదాలో 1921 లో తరలివెళ్ళి, ఆమరణానంతము అక్కడనే ఆయన ఉన్నాడు. లక్నో విశ్వవిద్యాలయంలో పని చేసిన 28 సంవత్సరాల కాలంలోను వృక్ష శాస్త్రాచార్యుడుగా, వృక్షశాస్త్ర శాఖాధిపతిగా విశ్వవిద్యాలయ విజ్ఞాన శాఖాధిపతిగా (డీన్ ఆఫ్ ఫేకల్టీ ఆఫ్ సైన్స్) విధులను నిర్వ ర్తిస్తూ, ఆ విశ్వవిద్యాలయ శాస్త్రపరిశోధనా గారాన్ని తీర్చిదిద్ది అది ప్రథమశ్రేణికిచెందిన సత్యాన్వేషణ కేంద్రంగా పెంపొంది ప్రపంచ ప్రఖ్యాతిని బడయుటకు ఆయన ఎక్కువగా కృషిచేసేడు. డాక్టరు సహానియొద్ద లక్నో విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్రంలో ఉన్నత విద్యనభ్యసించిన అంతేవాసులేమి, ఆయన ఆధ్వర్యమున పరిశోధనలుచేసి, ప్రఖ్యాతిని పొందిన సత్యాన్వేషకు లేమి నేడు భారతీయు లలో పలువురున్నారు.

౪

డాక్టరు సహాని శాస్త్రప్రతిభను విజ్ఞాన ప్రపంచమంతా ఏకగ్రీవముగా గుర్తించి, ఆయనకు పలుమారులు అంజలి ఘటించినది. ఇంతవరకు నిఖిల ప్రపంచ నీరాంజనముల నందికొన్న ఆధునిక భారత వృక్షశాస్త్రజ్ఞులు జగదీశచంద్ర బోస్, బీర్బల్ సహాని లిరువురే. వృక్షశాస్త్రంలో "నోబెల్" బహుమానం లేదు గాని ఉన్నచో ఆ విజ్ఞానవిశారదు లిరువురూ కూడ ఆ గౌరవశ్రీని పొందియే యుండేవారు. భారతదేశంలోని విజ్ఞాన సంస్థలన్నీ కూడా ఏదోరీతిని, చంద్రునికొక నూలుపోగన్నట్లు, డాక్టరు సహానిని సత్కరించేయి. ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు రామలింగారెడ్డి జాతీయ బహుమానాన్ని, వంగదేశ ఆసియాసంఘంవారు "బేర్లీ" బంగారు పతకాన్ని (1936) వివిధ

కిన్నెర

విశ్వవిద్యాలయాలవారూ గౌరవ డాక్టరేట్ పట్టాలను ఒసగి, ఆయన విజ్ఞానవైదుష్యానికి జోహారు లర్పించేరు. ఇండియన్ సైన్సు కాంగ్రెసుయొక్క వృక్షశాస్త్రశాఖకు 1921, 1938 సంవత్సరాలలోను, దాని భూతత్వశాస్త్ర శాఖకు 1926 లోను సహాని అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. 1940 లో చెన్నపట్ట ణంలో జరిగిన "ఇండియన్ సైన్సు కాంగ్రెస్"కు ఆయనయే మహా సభాధిపతి. "ఇండియన్ ఎకాడమి ఆఫ్ సయిన్సెస్," "నేషనల్ ఎకాడమీ ఆఫ్ సయిన్సెస్," "నేష నల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సయిన్సెస్"మున్నగు భారతీయ విజ్ఞాన సంస్థలలో ఆయన గౌరవ సభ్యుడు ; ఉపాధ్యక్షుడుకూడా, అఖిల భారత వృక్షశాస్త్ర సంస్థా సంస్థాపకుడుగా కూడా ఆయన విఖ్యాతుడు. ఇక విదేశములలో ఆంగ్లదేశమేగాక, జర్మనీ, ఆస్ట్రేలియా, హాలెండు, బెల్జియం మున్నగు పలుదేశముల వారు ఆయనను అనేక విధాలుగా గౌరవిం చేరు. 1930 లో కేంబ్రిడ్జిలోను, 1935 లో "ఆమ్స్టర్‌డాం"లోను జరిగిన అంతర్జాతీయ వృక్షశాస్త్ర మహాసభల కాయన ఉపాధ్యక్షు డుగా ఎన్నుకొనబడినాడు. కేంబ్రిడ్జిలోని ఎమేన్యూల్ కళాశాలలో ఆయన జీవితకాల సభ్యుడు. 1936 లో లండన్ రాయల్ సంఘము వారు తమ సంఘ సభ్యునిగా నెన్నుకొని ఆ విజ్ఞాన విశారదుని గౌరవించేరు. 1937 జూలై నెలలో మాస్కో నగరమున జరిగిన భూగర్భ శాస్త్ర మహాసభలోను, 1938 లో వియన్నా మహాసభయందూ కూడ డాక్టరు సహాని పరి శోధనలు ఎక్కువగా నుతింపబడ్డాయి. 1949 లో స్టాక్‌హోమ్‌లో జరిగిన అంత ర్జాతీయ వృక్షశాస్త్ర మహాసభ కాయన అధ్య క్షుడుగా కూడా వరింపబడినాడు. కాని ఆ పీఠాన్ని అలంకరించకుండానే క్రూరమృత్యు వాయనను 1949 ఏప్రిల్ 10 తేదీని పొట్ట బెట్టుకొన్నది.

చనిపోవునరికి డాక్టరు సహాని వయస్సు 58. ముప్పది సంవత్సరాల దీర్ఘకాల పరిశోధన కృషి ఫలితంగా మేధ పరిపక్వస్థితిని పొంది సుఫలితములను పుష్కలంగా ఈయగలిగిన సమయంలో ఆయన చనిపోయేడు. తన మర ణానికి సరిగా వారంరోజులకు పూర్వమే ఏప్రిల్ 3 వ తేదీని భారత ప్రధాని పండిత నెహ్రూచే తాను గత మూడు దశాబ్దాలనుంచీ కలలుగంటున్న "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పేలియో బాటనీ"కి లక్నో నగరంలో పునాది వేయించి నాడు. అట్టి సంస్థ ప్రపంచంలో ఇంతవరకు మరియెక్కడా లేదు, జీవితకాలంలో ఆర్జిం చిన స్థిరరూపకమైన యావదాస్తినేగాక ప్రామాణ్య పుస్తకరాజములతో విలసిల్లెడి తన శాస్త్రగ్రంథాలయాన్ని, తాను సేకరించిన అమూల్య నిక్షేపమనదగు ఫాసిల్‌ను కూడ ఆ సంస్థ కొసంగినాడు. ఆ సంస్థాపరిశోధనా గారాలలో ఉన్నతశ్రేణికి చెందిన పరిశోధనలు చేయుట కవకాశాలను కల్పించి, ఉజ్జ్వలమైన పరిశోధనలు చేయించాలనియును, ప్రపంచ మందత పేలియో బాటనిస్ట్స్ అందరకును దర్శనీయమైన దేవళముగా దానిని పెంపొం దించవలె ననియును ఆయన ఆశయము. కాని ఆ ఆశయము నెరవేరకుండగనే ఆయన చని పోయినాడు. చంద్రశేఖర వేంకటరామన్ వచించినట్లు "స్వాతంత్ర్యానంతరము భారత దేశమున విజ్ఞానమును పునర్వ్యవస్థీకరించు చున్న సమయంలో విజ్ఞాన విశారదుడు, ఉన్న తాశయమండితుడు అయిన డాక్టర్ సహాని చని పోవుటచే భారతావనికి తీరనిలోటు వాటిల్లినది."

# ప్రసిద్ధ అమెరికన్ మహిళలు

అమెరికన్ మహిళలు విద్య, విజ్ఞానం, రాజకీయం మొదలుగాగల సమస్త రంగాలలోను ముందంజ వేస్తున్నారు. పురుషులతో సమానంగా వివిధ క్షేత్రాలలో పురోగాములగుచు. బాధ్యతలను వహిస్తున్నారు. ఇటీవల (ది 15-4-50) వాషింగ్టన్‌లో జరిగిన "నేషనల్ ఉమన్స్ ప్రెస్ క్లబ్" వారి విందు సందర్భంలో ఆయా శాఖలలో ప్రతిభావంతులయిన మహిళలకు యోగ్యతా పత్రాలను బహూకరించినారు. ఆ సందర్భంలో యోగ్యతాపత్రములందిన కొంతమంది మహిళల చిత్రాలు ఇందీయబడినవి.



డోరతీ ఫాస్డిక్. ఈమె అమెరికన్ స్టేట్ డిపార్టుమెంటులో ప్రతిభను ప్రదర్శింపగలిగినందులకు యోగ్యతాపత్రం బడసినది.



మిల్‌డ్రెడ్ రెబ్‌స్టాక్. ఈమె సైన్సులో యోగ్యతను బడసిన వనిత.



పెరల్ వనమేకర్. ఈమె అమెరికన్ పబ్లిక్ ఇస్ట్రిక్షన్ శాఖకు సూపరింటెండెంటు. విద్యాశాఖలో ప్రాభవమున్నై ప్రశంససందిన మహిళ.



మార్తా గ్రాహం. ఈమె డాన్సులో ఆరితేరిన స్త్రీ.



క్లెయిర్ మాక్కార్డిల్. ఈమె కొత్త కొత్త ఫ్యాషణలను సృష్టించుటలో పేరెన్నికగన్నది.

# బండీవాడు

(బల్గేరియన్ కథ)

రచన:
డిమిటర్ ఇవానోవ్

అనువాదం:
శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు

"చీకటి పడకముందే వెళ్లిపోతామండి. అదుగో ఆకొండ చూశారా? ఆకొండ మొదట్లోనే వుంది గ్రామం. ఆగట్టు దాటామంటే ఊరుజేరుకున్నామన్న మాటేనండి." తన బక్కగుఱ్ఱాలను లగువు తీయించడానికై బండికుఱ్రవాడు వాటిని "చల్! చల్! పదండే" అంటూ అదలిస్తున్నాడు.

బురదగానున్న పల్లెటూరి మట్టిరోడ్డుమీద విపరీతంగా శబ్దం చేసుకుంటూ బండి పరుగెత్తుతోంది. డిసెంబరు నెలలో పడ్డ అకాలవర్షాలతో నేల అంతా చితచితలాడుతూంది. ఎంతపోయినా తరగనట్లున్న బీళ్ళలో ఊగిసలాడుతున్న బండి భయంకరమైన కటకట శబ్దం చేస్తూంది.

గ్రామీణ బాలకుడు తన గుఱ్ఱాలను మరొకమారు అదలించి, సర్దుకుని కూర్చున్నాడు. తడిసిన టోపీని సవరించుకుని హుషారుగా పదం ప్రారంభించేడు.

"అబ్బీ! నీ పేరేమిట్రా?" తోలుకోటు తొడుక్కుని బండిలో ముడుచుకూర్చున్న స్థూలకాయుడు ప్రశ్నించాడు.

కుఱ్రాడు వినిపించుకోకుండా జోరుగా పాడేస్తున్నాడు.

"ఓరి, విన్నేరా అబ్బీ!" బిగ్గరగా, కటువుగా అరిచాడా పెద్దమనిషి.

"ఏమిటండి?" కుఱ్రాడు వెనక్కు తిరిగాడు.

"పేరురా! నీ పేరు! నీ పేరేమిటీ అంట?"

"ఓంద్రా."

"ఓహో, ఓంద్రానా? తెలివైన వాడిలాగే వున్నావు? నువ్వేనన్న మాటేమిటి? మీరంతా తెలివి మీరిపోయారు. మీ పల్లెటూరి సజ్జంతా జిత్తులమారులే. అబద్ధాలు, మోసాలు ముందు పుట్టి, తర్వాత మీరు పుట్టారు. నేను రోజూ కోర్టులో చూస్తూనే వుంటాగా! మీరు వేసే వేషాలు ఒకటీ రెండూనా? మేకపిల్లల్లాగ—పైకి యెంత అమాయకంగా నటిస్తారు; లోపల తోడేళ్ళవంటి శుద్ధ దొంగ వెధవలు. ఎందుకు, జడ్జీలనే ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిస్తారు!"

"అట్లా ఆడిపోసుకుంటారు గాని మేమే ముందండీ. ఉత్తి అమాయకులం. ఏమైనా

మీరన్నంత చెడ్డవాళ్ళం కాదని నా ఉద్దేశం. మా రైతుల మున్నామే. అమాయకత్వంవల్ల గాని, లేకపోతే మోసాలెందుకు చేస్తామండి? తెలియనితనము, బీదతనము వీటన్నిటికీ మూలకారణాలు.''

"అబ్బో! బాగా సర్దుకున్నావురా! బీదతనం మూలాన్నట! అమాయకత్వం, బీదతనాల పేరు చెప్పి చేపల్లాగ యెట్లాపడితే అట్లా తోకలు యూడిద్దా మనుకుంటున్నారా పాపం?''

"అయితే, బాగా డబ్బెక్కువై బాధపడు తున్నామంటారా? అది పిచ్చి మాటండి. ఇంక, త్రాగుడంటారా మాలో అంతా తాగుతారు. ఆ కాస్సేపైనా కష్టాలు మరిచిపోవడానికి గాని ఉన్న మారాజుల్లాగ డబ్బుతో మత్తెక్కటం వల్ల కాదండి.''

"ఓసెబ్బ! చెప్పాడురా ఉపన్యాసం. ఏం నాయనా, నువ్వుకూడ దోసు వేసినవాడిలా గున్నావు. సరిగా మీసకట్టైనా రాలేదు. అప్పుడే ప్రారంభించినట్టున్నా వేంరోయ్? మీ రైతులున్నారే—చెప్తున్నా రాసుకో—యెందుకూ పనికిరారురా అబ్బీ. పైగా శుద్ధ మోసగాళ్లు అంటే నమ్ము."

"రాసుకోడం మాకు చేతకాదండి. చేతనైనవారు మీరే రాసుకోండి!" అని కుర్రాడు తన బక్క గుర్రాల వంక తిరిగి "చల్, చల్! పదండి బాబులూ'' అంటూ ఆదలించి తీవ్రాలోచనలో మునిగిపోయాడు.

గుర్రాలు తాముకూడ ఆలోచిస్తున్నట్లు ఒక్కమారు తమ పరుగును మందగింపచేసి మరల పోనారంభించాయి.

బండిలోని పెద్దమనిషి కూడ తన తోలు కోటును సర్దుకుని దీర్ఘాలోచనలో పడ్డాడు.

ప్రకృతి యావత్తూ ఆలోచనా వ్యథితమైనట్లుగా కనుపడుతోంది. ఒంటరిగా నున్న ఒక చెట్టుమీద వర్షంలో తడిసిన తన రెక్కలను ముడుచుకుని కాకి ఒకటి హృదయ విదారకంగా విలపిస్తోంది. మసక మసకగా నున్న శీతకాల వాతావరణం మరుసటిరోజు పండుగ యెంత నిస్తేజంగా, నిరుత్సాహంగా ఉండబోతోందో సూచిస్తోన్నట్లుంది.ఆకాశంలో దట్టమైన మేఘాలు యిటు నటు నడయాడుతూ ఒండొరుల నొరసుకుని ఉరుముతున్నాయి. నేల అంతా చెమ్మతోను, బురదతోను నిండి చితచితలాడుతోంది. దూరానవున్న గ్రామాలు, పిల్లకాల్వలు, అడవులు, పర్వతాల దృశ్యాలు అస్పష్టమై జీవరహితమై, వికలమై పోతు న్నాయి. చచ్చినవాని కండ్లవలె బీళ్ళలో అక్కడక్కడ యేర్పడిన నీటి మడుగులు నిస్తేజంగా ప్రకాశిస్తున్నాయి.

ఆ చిన్న బండి బురదతో నిండిన రోడ్డు మీద పూటీ గోతుల్లో దిగబడుతూ, మెరక లెక్కుతూ, మెలిదిరుగుతూ, దొర్లుకుంటూ పోతూంది. వదులుగా వున్న బండి చెక్క ఒకటి అవిరామంగా కటకట మను భయంకర శబ్దం చేస్తూంది. పాపం ఆ శబ్దం బండిలో నున్న స్థూలకాయుడైన పెద్దమనిషికి అసవస రంగాను, అర్థరహితంగాను తోచింది. కొంత సేపటికింక భరించలేక ఆయన తన బలిసిన

ముఖాన్ని వెళ్లబెట్టి అరిచాడు: "దీన్ని తగలెయ్య, యేమటీ గొడవ!"

"ఆ చెక్క మేకు ఊడిపోయిందండి. పెద్ద పండితునిలా బడబడ వాగుతోందంతే. దాని వాగుడికి అర్థ మేముంటుంది లెండి!"

"ఓంద్రా! నువ్వు బలే దేవాంతకుడిలాగున్నావురా! ఆడపిల్లల్నిట్టే బుట్టలో పెట్టేట్లాగున్నావే! మీ రైతుల్లో పెళ్లిళ్లు చిన్నతనాల్లోనే అయిపోతాయి. మీ ఆడవాళ్ళుకూడ అందంగానే వుంటారు."

ఇలా వేళాకోళం చెయ్యడంలో ఆ పెద్ద మనిషి తన కోటు కాలరును వెనక్కు మడిచేశాడు.

"మీరు నూరు చెప్పండి, వెయ్యి చెప్పండి! నాకు తెలిసినంతవరకు పెళ్లి అయిన ఆడవాళ్లే నయమండి! అవునుగాని బాబుగారూ తెలియ కడుగుతాను, మా ఊరు యేమన్నా పనిమీద వస్తున్నారా?"

"నేను కోర్టు కమిషనర్‌నిరా."

ఓంద్రా వెనక్కు తిరిగి బండిలోని పెద్ద మనిషి వంక గ్రుచ్చి చూశాడు.

"అయితే గవర్నమెంటు పనిమీద వస్తున్నారా బాబూ?"

"అదే, అదే. మీలో ఒక దొంగవెధవ దగుల్బాజీ పనొకటి చేశాడు. ఈమారు వాడి పని పడతాలే. నా చేతుల్లో పడ్డాక వాడింకెక్కడ మెసలగలడు? కోర్టునుంచి కాగితం తెచ్చానుగా. దానితో చిన్నప్పుడు మింగిన దొండాకు పసరు కూడ కక్కాలిసిందే. లేకపోతే మమ్మల్ని మోసం చేస్తారా? వెళ్లగానే సోదాచేస్తే అన్నీ బయటపడతాయి. వాడి ధాన్యమంతా, ఒక్క గింజ మిగల్చకుండా జప్తు చేసిగాని వదులుతానేమో చూడు! ఈ దెబ్బతో నన్నూ, యీ పండగరోజునూ వా డెన్నటికీ మరవకుండా చేస్తాను. ఒక్కసారి అట్లా చేస్తేగాని వాడికే కాకుండా మిగతా వాళ్లకి కూడ బుద్ధిరాదు. లేకపోతే, గవర్నమెంటుతో వేళాకోళాల్రా మీకు? కుళ్ళిపోయిన గుడ్లూ, పులిసిపోయిన వెన్నా అంటగట్టి మోసగించడానికి అవతలి వాళ్లు బస్తీ షావుకార్లు అనుకున్నార్రా? ఆగండి దొంగముండాకొడుకుల్లారా, యిన్నాళ్లకి కోర్టువాళ్ల చేతుల్లో పడ్డారు. ఇంకెక్కడికి పోతారో చూస్తాగా! దెబ్బ దేవేంద్రలోకం చూపుతుంది. మీకు కావలసిందల్లా కొరడా దెబ్బలురా! మీరంతా త్రాగుబోతు వెధవలైపోయారు. పన్నులు కట్టడం యెగవేస్తున్నారు. గవర్నమెంటును కూల్చివెయ్యాలని చూస్తున్నారు! నేనే కనుక రెండురోజులపాటు జారు ప్రభువునైతేనా మీ పని చెప్తును మరి. మీలోని లోపాలను తుప్పు రాలగొట్టినట్టు రాలగొట్టి మిమ్మల్నందరినీ దేవతలను చేసేద్దునంతే. ప్చ్! కాని నన్ను జారును చేసే దెవరు?"

కోర్టు కమీషనరు ఉద్రేకంలో తన కోటు గుండీల నూడదీశాడు. కోటులోపల అతని శరీరం గుడ్డులో పిల్లవలె ముడుచుకుని వుంది.

"కమీషనరుగారూ, దేముడు బలేవాడండి! ఏమంటారూ, ప్రపంచాన్ని సృష్టిస్తూ ఆడవాళ్లకి మీసాలు, గడ్డాలు అనవసరమనుకున్నాడో ఏమో వాళ్లకి మీసాలు గడ్డాలు మొలవకుండా

చేసేశాడంతే! గాడిదలకి పెద్ద చెవులుండాలని నిర్ణయించుకున్నాడు కాబోలు. అంతే, వెంటనే ప్రతి గాడిదకీ ఒక్కొక్క జత పెద్ద చెవుల నిచ్చేశాడు." ఓంద్రా అమాయకత్వాన్ని నటిస్తూ ఎంతో సహజంగా అన్నాడు!

"పిచ్చివాగుడు సాగించక బండి తోలరా అబ్బీ. అప్పుడే చీకటి పడుతోంది. రేపు పండగ కూడాను. ఇంటికి తిరిగి వెళ్ళిపోవాలి. కిరాయి చూస్తే దారుణం! పట్టుమని పది మైళ్లుందో లేదో ఆరు రూపాయలు పడేసి లాగుతున్నావు. కాని ఎక్కడా దూరం తరుగుతున్నట్లే లేదు. తోలరా అబ్బీ, తోలు! బక్కముండలు నిద్రపోతాయి కూడాను!"

"చల్, చల్, నడవండే బాబూ!" కమ్చీని విదలిస్తూ ఓంద్రా గుర్రాలను, అదిలించాడు.

"నడవండి బాబులూ! తమ్ముళ్లూ అని పిలిస్తే ఇంకా బాగుంటుంది" కమీషనర్ మండిపడ్డాడు.

"కమీషనర్‌గారూ, బాబులూ అనకపోతే వాటికి కోపం వస్తుందండి! మీ రేమిటో అనుకుంటున్నారు కాని అవి చాలా పెద్దమనుషులండి. వాటి పనికూడా కోర్టు పని లాంటిదే. అవి గంటల ప్రకారం అతి నియమబద్ధంగా నడుసాయి. పొద్దున్నే లేస్తాయి. వేళకి దాణా, నీళ్లూ పెడతాము. ఆ తర్వాత కళ్లేలు తగిలిస్తాము. ఆవి ఆఫీసుకు వెళ్తాయి. సాయంత్రం దాకా అల్లాగే బరువు లాగుతాయి. రాత్రి మళ్లీ భోజనం చేస్తాయి. నీళ్లు త్రాగుతాయి. కొంతసేపు వార్తలు చదువుచున్నట్లు నెమరు వేసాయి. తర్వాత కునుకు తీస్తాయి. అంతా ఆఫీసు పనే!"

"మీ కల్లు దుకాణం ఎక్కడరా అబ్బీ? సరేగాని ఆవాగుడు కట్టిపెట్టి తొందరగా బండి తోలు. లేకపోతే ఆలస్యమైపోతుంది. నువ్వెక్కడో దేవాంతకుడిలా గున్నావే!"

"అబ్బే, ఈ ప్రాంతాల్లో తోడేళ్లు లేవండి కమీషనరుగారూ, మరేం భయం లేదు." అన్నాడు బండివాడు. అతని స్వరం గౌరవనీయుడైన కోర్టు అధికారి కెట్లాంటి భావం కలిగించిందో గాని ఆయన భయంతో తన చుట్టూ కలయ చూశాడు.

"అబ్బే తోడేళ్లంటే నాకేం భయం లేదురా అబ్బీ. ఈ చలిగాలి వుందే, దీనితో పడిశం పడుతుందేమోనని అనుమానంగా వుంది. పడిశం పట్టిందనుకో ఎంత పని చెరుపో చూడు మరి, ఏమంటావ్?"

కొంతసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది.

"అయితే, మీరు ఆఫీసు పనిమీద వస్తున్నారన్న మాట. ఈసారి ఎవరి పని పడతారేమిటండి?" ఓంద్రా ప్రయాణీకుని వంక తిరిగి గంభీరంగా ప్రశ్నించాడు.

జవా బిచ్చేందుకు కమీషనరు కొంత సంకోచించాడు. "నీకు చెప్పతే మటుకేంరా? స్టానోయ్‌చో లేదూ? పొట్టిగా వుంటాడే, లావు మెడా వాడూను, వాడు."

"అవునవును స్టానోయ్‌చో నెరకేకం,

క్నైర

అతని ధాన్యం జప్తు చేస్తారన్న మాట. పాపం, అతను చాలా బీదవాడండీ కమీషనరుగారూ. రేపు పండుగ కూడాను. ఈ ఒక్కసారీ వది లెయ్యండి పాపం!"

"బీదవాడే, కాని దొంగ ముండాకొడుకుల్లో మొదటి రకం!" కమీషనరు నిశ్శబ్దంతో మునిగి పోయాడు. చీకట్లు క్రమంగా అలుము కుంటున్నాయి. ఎదుటనున్న కొండ దాటుతేగాని గ్రామం జేరుకోరు. గుర్రాలు కొండ నెక్క లేక ఆయాసపడుతూ మెల్లగా ఈడ్చుకుంటూ పోతున్నాయి. ఓంద్రా ఇంక, వాటిని అదిలించ డం తోలడం మానివేసాడు. మాటలు కట్టి పెట్టాడు. పాటలు చాలించాడు.

వారు కొండ జేరి అవతలి ప్రక్కకు దిగ నారంభించే సరికి చీకటి పడిపోయింది. కాని గ్రామం జాడ మాత్రం పొడగట్టడం లేదు. బురదతో నిండిన నేల మీదుగా రివ్వున గాలి వీస్తోంది. గాలికి చెల్లాచెదరైన మేఘశకలాలు పర్వతములవంక పయనిస్తున్నాయి. నీలాకాశం మేఘవినిర్ముక్తమై మరింత ఎత్తుకే దిగినట్లు కానవస్తోంది. అంతలోనే మిలమిల మెరిసే చుక్కలు నింగిలో తొంగి చూ చా యి. వాతావరణమంతా శీతలమై పోయింది.గుర్రాలు మందంగా, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాయి.

"తోలరా సోమరిపోతా! త్వరగా తోలు! ఇంక ఆట్టే సేపు ఇక్కడ ఉంటే చలికి పిడచ కట్టుకు చస్తాం" కోపంతో మండిపడుతూ అరిచాడు కమీషనర్.

ఓంద్రా ఇదేమీ పట్టించుకోలేదు. పరధ్యా నిమగ్నుడై గుర్రాలను అదిలించి యేదో ఆలోచిస్తు న్నాడు. తమను కానన్నట్లు గుర్రాలు ఏ మాత్రం లెక్కచెయ్యకుండా యథాప్రకారం గానే అనిష్టంగానే అడుగుల్లో అడుగులు వేసు కుంటూ నెమ్మదిగా ముందుకు సాగుతున్నాయి.

మరునటి ఉదయమే స్టానోయ్‌చో ధాన్యం పాపం కమీషనరు జప్తుచేస్తాడు కదా అని ఆలోచిస్తున్నాడు ఓంద్రా

"ఈ కష్టాన్ని నానెత్తిమీదికి తెచ్చింది— ఓంద్రా, నువ్వే" అని స్టానోయ్‌చో తనను నిందిస్తాడు. అట్టాఅని ఊరుకుంటాడా పోనీ? తనని భోజనానికి పిలిచి కండ్లనీరు పెట్టుకుం టాడు. స్టానియ్‌చో చాలా మెత్తని హృద యం కలవాడు. ఆ విషయం ఓంద్రాకి బాగా తెలుసు. అతను తప్పకుండా కంట తడి పెడతాడు.

పాపం, స్టానోయ్‌చోకి యేదో విధంగా సహాయం చెయ్యాలి. రాత్రికి రాత్రి ధాన్యం దాటవేసి, గాదెలో ఒక్కగింజ కూడా లేకుండా శుభ్రపరచాలి. లేకపోతే యీ సంవత్సర మంతా స్టానోయ్‌చో కుటుంబం పస్తులు పడుకోవలసిందే. తానేదో ఒకటి చెయ్యాలి!

కన్నుపొడుచుకున్నా యేమీ కనిపించటం లేదు. నేలంతా యెటు చూచినా బురదతో నిండివుంది. రోడ్డుకూడా బురదక్రింద కప్పు బడిపోయింది.

ఓంద్రా కళ్ళేలనులాగి గుర్రాల నాపాడు.

"కమీషనర్‌గారూ, దోవ తప్పామేమోనని

భయమేస్తోందండి!" కుర్రాడు చీకట్లోకి వంగి చూశాడు.

కుర్రాడి ముఖ కవళికల్లో వెనుకటి జిత్తులమారితనం కమిషనరు కేమాత్రం కనుపించ లేదు.

"ఒరే అబ్బీ. జాగ్రత్త! తెలిసిందా? వెర్రివేషాలేస్తే వళ్ళు హూనం చేస్తా."

ఓంబ్రా కళ్ళేల నొక్కమారు కుదిపి, కమ్చీని ఝాడించి గట్టిగా పట్టుకోండి కమీషనర్ గారూ! అన్నాడు. అల్లంత దూరాన వున్న గ్రామంలోని దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. కుక్కలు మొరుగుతున్నాయి. కుడి వంక కొద్దిఅడుగుల దూరంలో నున్న చలన రహితమైన పెద్దనీటి మడుగులో నక్షత్రాలు ప్రతిబింబిస్తున్నాయి. బండి ఆ పక్కకు మళ్లింది.

"ఏమిట్రా అది"అని అడిగాడు కమీషనరు.

"నీళ్ల గుంటండీ కమీషనరుగారూ, రోడ్డు సరిగా అందులోంచే పోయిందండీ. ఫరవా లేదు లెండి. అట్టే లోతుండదు. అక్కడక్కడ చిన్న పూటి గోతులుంటాయంతే. అక్కడే— నడిచివెళ్లినా, బండిమీదవెళ్లినా నేను సర్వ సాధారణంగా దారితప్పుతూ వుంటాను. చల్, చల్, పదండి బాబులూ! గట్టిగా పట్టుకోండి కమీషనర్ గారూ!"

నక్షత్రాలు ప్రతిబింబిస్తూన్న చల్లని నీళ్ల గుంటలో గుర్రాలు దిగబడ్డాయి. లోతుకు వెళ్లేకొద్దీ మరింత మందంగా నడవసాగాయి. బురదలో అవి అంతకంతకు కూరుకుపో సాగేయి. నింగినీలాలు ప్రతిఫలిస్తూన్న నీళ్లలో అలలు చెలరేగాయి.

"ఆగరా, వెధవా!" కమీషనరు విపరీతమైన భయంతో కంపిస్తూ. కోటును ఒంటి కదుముకుంటూ అరిచాడు. "నన్ను ముంచేస్తావురా వెధవా! చూడు బండి నీళ్లతో యెల్లా నిండిపోతోందో! ఆపరా. ఆపు!"

ఓంబ్రా ఆగాడు, చక్రాలు మరింత లోతుగా బురదలో కూరుకుపోయాయి. దట్టమైన చీకట్లో నీటిగుంట తుదా మొదలూ కనిపించకుండా పోయింది.

"నడపండర్రా, ముందుకి" ఓంబ్రా గుర్రాల నదలిరిచాడు. అతని గొంతుక చీకట్లో ప్రతిధ్వనించడం తప్ప ప్రతిఫలం లేక పోయింది.సమీపంలో కొన్ని అడవిబాతులు మాత్రం యీ శబ్దానికి బెదరి తటతట కొట్టుకుంటూ పారిపోయాయి.

"మనం కూడా బాతుల అవతారమెత్తి యీదుకు పోతేగాని లాభం లేనట్లుగా వుంది. లేకపోతే—" అన్నాడు ఆలోచనా పూర్వకంగా ఓంబ్రా.

"ఓరీ, పక్షీ! ఇది దాటనియ్యి చెప్తాను నీ పని! సున్నంలోకి యెముక మిగల్చకుండా తన్నకపోతే నన్ను పేరున పిలవకు! ఓరి గాడిదా, మునిగిపోతాంరా యిక్కడ!"

"ఫరవాలేదు, కమీషనరుగారూ మునిగిపోం లెండి. ఎంత చీకటిగా వుందో చూశారా? ఇంత చీకట్లో యెవ్వరైనా దోవ తప్పుతారు.



కిన్నెర

కంగారుపడకండి'' అంటూ ఓంబ్రా కళ్లాలను పరీక్షించ నారంభించేడు. కళ్లేలు యిటుతిప్పి అటుతిప్పి కడుతూ, విప్పుతూ గట్టిగా బూతులు తిట్ట నారంభించాడు. కొంత సేప టికి బండియెక్కి కమ్చీ విదల్చి చల్, చల్, నడవండి బాబులూ '' అని అరిచాడు.

గుర్రాలు కదిలి ముందుకు నడవ నారం భించాయి. అకస్మాత్తుగా ఒకగుర్రం కళ్లేన్ని వదల్చుకుని ముందుకుపోయింది. రెండవది బండిముందు నిలబడిపోయింది.

"ఓరి అబ్బీ. అబ్బీ. యిప్పుడెల్లాగురా ?'' కమీషనరు అరిచాడు.

"దోరా ! దోరా. ఆగు !'' అంటూ ఓంబ్రా దాన్ని వెనక్కి రమ్మని బ్రతిమాలనారం భించాడు.

కాని చుట్టూ వ్యాపించియున్న నీటినిచూసి బెదరిపోయిన ఆ గుర్రం తన యజమాని కోర్కెను పెడచెవినిబెట్టి గట్టెక్కి చీకటిలో లీనమైపోయింది.

కమిషనర్ భయంతో కంపించిపోతూ బండిలో లేచి నిలబడ్డాడు.

ఓంబ్రా అంతలోనే రెండవ గుర్రంపై కురికి "దోరా ! దోరా ! వెనక్కురా, దోరా'' అంటూ బిగ్గరగా అరుస్తూ అది పోయిన త్రోవనే పోనారంభించాడు.

"ఎక్కడికిరా పోతున్నావు ? ఆగు ! ఓరి పశువా ! ఓరి దొంగవెధవా ! ఓరి రైతుముండా కొడుకా, నీరోగం కుదురుస్తానుండు!''

చీకట్లో, నవ్వుతప్ప అతని బెదరింపులకు మరేమీ జవాబురాలేదు.

"ఓరిగాడిదా! అయితే నన్నిక్కడ ఒంటిరిగా చచ్చిపొమ్మని వదిలేస్తున్నావన్న మాట ! జంతువులికి నన్నాహారంగా వేస్తున్నావా ! బాబ్బాబు, మంచి కుర్రాడివికాదూ ! ఇదుగో నిన్ను వేడుకుంటున్నాను. వెళ్లిపోకురా నాయనా !'' కంపితస్వరంతో కమీషనరు బ్రతి మాల నారంభించాడు.

"భయపడకండి, కమీషనరుగారూ, భయ పడకండి" ఓంబ్రా స్వరం వినవచ్చింది. "ఈ నీటిగుంటలలో ఆడవిజంతువులేం లేవులెండి. బాగా కప్పుకోండి. లేకపోతే జలుబు చేసేను. జలుబుచేస్తే యెంతపని చెరుపో మీకు తెలు సుగా ? ప్రొద్దు పొడిచీ పొడవడంతోనే నేను వచ్చేస్తాను. బండిలో గడ్డివుంది. గడ్డితో పక్కవేసుకోండి. రాత్రి పడకకి కిరాయి ఏమి తీసుకోనులెండి :''

"ఒరే, అబ్బాయ్, వేళాకోళం చెయ్య కురా'' కమీషనరు ప్రార్థించాడు. "నన్నొం టరిగా వదలి వెళ్లిపోకురా, వెనక్కి వచ్చి, నన్నిందులోంచి యెట్లాగైనా బయటకు తియ్యరా !"

చీకటిగా వుందండి, కన్ను పొడుచుకున్నా యేమీ కనుపించడంలేదు, పైగా నా గుర్రం కూడా పారిపోయింది ! మరి నన్నేం చెయ్య మంటారు చెప్పండి ? లాభం లేదండి !''

ఆ వెక్కిరింత శబ్దం చీకట్లో యీదుకుంటూవచ్చి కమీషనరు చెవుల్లో ప్రవేశించింది. రానున్నది తలుచుకుని, భయంకరమైన ఆమదుగులో వొంటరిగానున్న కమీషనరు కండ్లనీళ్ల పర్యంతమై దీనంగా దేవుళ్లాడ నారంభించాడు.

"ఒరే, ఓంద్రా! వెనక్కి రారా నాయనా, బాబ్బాబు, నీకు పుణ్యముంటుందిరా! ఇక్కడ చచ్చిపోతానురా! పిల్లలు కలవాణ్ణిరా! రేపు పండగ కూడానురా! ఒరే, నీకు హృదయం లేదురా!" అతనిస్వరం రుద్ధమైపోయింది. అతని చెవులు దోరపెట్టుకొని విన్నాడు. కాని జవాబేమీ రాలేదు. దానితో మతి చలించిన వానివలె చీకట్లోనికి పెడబొబ్బలుపెట్ట నారంభించాడు. "ఒరేయ్! పశువా! గాడిదా! వెనక్కిరారా! వచ్చి నన్నవతలకు లాగరా! నీకు పుణ్యముంటుందిరా? పిల్లలు కలవాణ్ణిరా, రేపు పండగ కూడానురా! ఓరి రైతుగాడిద కొడకా! ఒరేయ్, కుక్కల కొడకా!"

బండిలోని కొరుగుతూ, కోటును బిగించుకుని చిన్న పిల్లవానివలె వెక్కివెక్కి యేడువ నారంభించాడు.

పాపం జవాబు మాత్రం యేమీ రాలేదు.

# ఏరిన ముత్యాలు

## లేపాక్షి అనన్య శిల్పకళా నిధాన

రచన : డాక్టర్ కె. ఎ. ఎస్. రావు

లేపాక్షి దేవాలయంలో బ్రహ్మాండమైన కళా ప్రాశస్త్యం ఉన్నది. దీనిపై మనం విజయనగర శిల్ప, శైలినీ ఆనాటి భావసంపత్తినీ పరిశీలించవచ్చును. సున్నితమైన ఈ దేవాలయ శిల్పం కొన్ని లక్షణాలలో మైసూరు హరిజా దేవాలయ శిల్పాన్నీ, సోమనాథ దేవాలయ శిల్పాన్నికూడా అతిక్రమిస్తున్నదని చెప్పవచ్చును. కళా నిలయమైన ఈ దేవాలయం ఇంతకాలంనుంచీ ప్రభుత్వ దృష్టినీ, ప్రజలదృష్టినీ ఆకర్షించకపోవడం చాలా ఆశ్చర్యకరమైన విషయము. ఇప్పుడివి చాలావరకు శిథిలమైపోయినది. దీనిని పరిశీలిస్తే శతాబ్దాలకుపూర్వం ఉన్న మన ప్రాచీనుల మహత్వము వారి కళాదృక్పథము బోధపడతాయి.

లేపాక్షి ఒక చిన్న కొండమీద కట్టారు. దీని చుట్టూ ఒక దృఢమైన ప్రాకారం ఉన్నది. ఇది కోట గోడకంటె దృఢమైనది. దురదృష్టంచేత ఇక్కడి శిఖరాలన్ని కూలిపోయాయి. అందుచేత ఈ కొండపక్కనుంచి ప్రయాణించే యాత్రికులు కూడా ఈ దేవాలయ ప్రాశస్త్యాన్ని గుర్తించలేక పోయారు. ఈ దేవాలయంలోని శిల్పాలు, సున్నితమైన చిన్నచిన్న చెక్కడాలు చూస్తుంటే కాలం క్రమక్రమంగా నిలిచిపోతున్నట్లనిపిస్తుంది. "శిల్పం కరడుగట్టినవేళ" అనే సూక్తి ఈ దేలాలయంపట్ల సార్థకమైనదని చెప్పవచ్చును. ఈ దేవాలయ శిల్పాల సామర్థ్యం ప్రతీ చిన్న శిల్పంలోను గూడా ప్రత్యక్షమౌతుంది. ఇక్కడ ఒక పెద్ద రాతితో చెక్కిన రెండు దేవతా శిల్పాలున్నాయి. వీటిలో ఒకటి గణేశునిది. రెండవది నాగభూషణునిది. వీటిని దర్శించినవారు శిల్పకళా చాతుర్యానికి ముగ్ధులై తన్మయులౌతారు.

లేపాక్షి దేవాలయపు చెక్కడాలలో అనేక కళా ఖండాలున్నాయి. వాటివల్లనే ఈ దేవాలయానికి ఒక ప్రత్యేకత ఏర్పడుతున్నది. కళ్యాణ మండపంలోమానవపరిమాణంలో చెక్కిన శిల్పాలు చాలాఎక్కువగాఉన్నాయి. వీటిలో గంగా, సూర్య, తుంబురు, నందికేశ్వరుల మూర్తులు చాలాముఖ్యమైనవి. ఇవిఎంతో కన్నులపండువుగా వుంటాయి.వీటిని పార్వతీ పరమేశ్వరుల కల్యాణ మహోత్సవంలో ఉన్నట్టుగా చెక్కారు. ఈ విగ్రహాలకు సామాన్యంగా భారతదేశ దేవాలయాల్లో చెక్కబడే విగ్రహాలకు చాలా తేడా ఉన్నది. ఇక్కడి విగ్రహాలు పురాణాల్లో చెప్పబడిన మూర్తిలక్షణాలకు బాగా సరిపోతున్నవి. ఈ విగ్రహాలే కాక గర్భగుడిలో కూడా చక్కని శిల్పాలున్నాయి. ఈ శిల్పాలను స్వయంగా తిలకిస్తేతప్ప వీటి ప్రాశస్త్యం వివరించడం కష్టము.

ఇదిగాక గోడలమీద కిరాతార్జునీయ, నరనారాయణాది గాథలను వర్ణించే రంగురంగుల చిత్రరువులనేకం ఉన్నాయి. రంగమంటపం పైకప్పుమీద గిరిజా కల్యాణము, భూకైలాసము మొదలయిన వాటినిగురించిన చిత్తరువులున్నాయి. ఇవి ఎన్నో శతాబ్దాలకుపూర్వం చిత్రించిన చిత్తరువులు. కొంత మంది దుర్మార్గులు ఇక్కడ వంటలు చేసుకున్నారు,

అందుచేత ఇవి పొగ చూరిపోయాయి. ప్రాకృతిక కారణాలవల్లకూడా ఈ చిత్రాలు పాడైపోతున్నాయి. వీటిని వెంటనే పునరుద్ధరించే ప్రయత్నాలు చేస్తే తప్ప మరి ముందుతరం వారి కివి దక్కవు. ఈ చిత్తరువుల పరిశీలనవల్ల దేవాలయనిర్మాణకాలము, విజయనగర చారిత్రకాధారాలు దొరకవచ్చును. ఈ చిత్తరువులలో కొన్ని ఈనాటికి కూడా చెక్కుచెదరకుండా కన్నులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. దీనినిబట్టి ఆనాటి చిత్రకారులు ఎంతటి ప్రశస్తమైన రంగులను సమకూర్చుకొన్నారో గ్రహించవచ్చును. గర్భగుడి అంధకారవంతంగా ఉన్నది. ఇక్కడ పై కప్పుమీది చిత్తరువులను ఎంతో సూక్ష్మంగా పరిశీలించవలసి ఉన్నది; అంత వరకు వీని ప్రాశస్త్యం మనకు తెలియదన్నమాటే!

—ఆంధ్రపత్రిక, (16—7—50)

## సోవియట్ నాట్యకళ

### రచన : నికొలై పీర్తా

రష్యన్ థియేటర్ యొక్క చరిత్ర మన మనస్సునిట్టే ఆకర్షిస్తుంది. అది ప్రబోధకరమైందికూడాను. సాంఘిక సంబంధాల అభివృద్ధిని యథాతథంగా ప్రతిబింబించిన థియేటర్లే కాలపరీక్షకు నిలవ గలిగాయి. ఇటువంటివి రెండే వున్నాయి. ఒకటి మహానుభావులైన రష్యన్ స్టేజి డైరెక్టర్లు కె. ఎస్. స్టానిస్లావస్కీ, వి. ఐ. నెమిరొవిచ్ డాన్ చెంకోలు స్థాపించిన మాస్కో ఆర్ట్ థియేటర్; రెండవది మాలీ థియేటర్. మేధావుల్లో, కార్మికుల్లో గల అభ్యుదయ వర్గాలు వీటిని పూర్తిగా బలపరచి సహకార మందజేసినవి.

ఈ థియేటర్లు వాటి ఆశయాలకూ, ఆదర్శాలకూ నైతికశక్తికి సంబంధించినవారిని నాటకకర్తలలో నుండి ఎన్నుకోవడంచేతనే, అవి నాట్యకళలో మాత్న శిఖరాలను అందుకో గలిగాయి. ఈ నాటక రచయితలు ఎ. ఓస్ట్రొవిస్కీ, ఎ. చెకోవ్, ఎమ్. గోర్కీలు ఆనాటి దుఃఖభాజనమైన జీవిత సమస్యలనూ, ఈనాటికీ మనలను చలింపజేసే శక్తివంతమైన పాత్రలనూ విశిష్టమైన తమ రచనల్లో పొదిగి పెట్టే రీరష్యన్ మహాకవులు. ఈ రెండు థియేటర్లూ, నిరంకుశ పాలనాతిమిరంలో వెలుగుకై పరితపించే ప్రజల హృదయాలలో ఉజ్వల భావ పరంపరలను కదిలించాయి.

మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవానంతరం యీ థియేటర్లకు సృజనాత్మకమైనట్టి అభివృద్ధి నందుకొనే నూత్నశకం ఆరంభమైంది. దీన్ని సులువుగా అర్థం చేసుకోవచ్చును. ప్రజలతోపాటు యీ థియేటర్లలోని అభ్యుదయ కాముకులు ఏ సాంఘిక న్యాయం ప్రజాతంత్ర భావాలకై పోరాడేరో అవన్నీ సాక్షాత్కరించాయి. ప్రజలకు దగ్గరైనవీ, ప్రియమైనవాటి నన్నిటినీ తమ నాట్యకళ ద్వారా ఎలుగెత్తి చెప్పడానికి వాటి కవకాశ మివ్వబడింది. విప్లవానంతరం యీ థియేటర్ల ప్రజాతంత్ర అభిలాషలు మరింత వికసించి విశాలమైనాయి. వాటి గంభీరమైన వాస్తవిక కళావెలుగు వెల్లువలను ప్రవహింపజేశాయి. నామమాత్రమైన "వామపక్ష కళావేత్త" లైతేనేమి, వస్తువుకంటె స్వరూపానికే ప్రాధాన్యమిచ్చే థియేటర్లయితేనేమి, చిన్న చిన్న థియేటర్లయితేనేమి కాలపరీక్షకు నిలవలేక పోయాయి. కారణం, జీవితాన్ని యథాతథంగా, వాస్తవిక దృష్టితో అర్థం చేసుకోనిదేదైనా సోవియట్ ప్రజలకు అతి దూరమైంది, సహింపరానిది.

ముప్పయిరెండేళ్లలో సోవియట్ నాట్యకళ పురోగమించి పటిష్ఠమైంది. దాని ప్రయోజన పూరితమైనట్టి మహోన్నత లక్ష్యమైతేనేమి, దాని సృజనాత్మక సోషలిస్టు వాస్తవికతయైతేనేమి ప్రజలలో సంపూర్ణమైన ఆమోదాన్ని, అభిమానాన్నీ చూరగొన్నాయి. ఈ థియేటర్లకు రోజూ వేలకొద్దిజనులు హాజరవుతారు. వారీ థియేటర్ల నుండి సమకాలిక సమస్యలకన్నిటికీ జవాబులు తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారు.

సోవియట్ థియేటర్ల కార్యక్రమాల్లో ముఖ్య స్థానం ఆధునిక నాటకాలదే. ఇది సహజమే. తమ శ్రేయస్సును ధ్వనించేవీ, సమకాలిక జీవితంలోని అభ్యుదయ భావాలను ప్రతిబింబించేవీ యైన నాటకాలంటేనే సోవియట్ ప్రజలకు అభిమాన మెక్కువ.

అయితే సోవియట్ నాటకాలలో అధికభాగం ఆక్రమించుకున్న ఇతి వృత్తాలేమిటి ? సోవియట్ నాటక రచయితలు వ్రాసినరచనల్లో ఎక్కువగా యీ యుగంలోని ముఖ్య సంఘటనలకు సంబంధించినవే. ఈ రచయితల కార్యభారం, ఈ నా టి జీవితానికి ప్రాతినిధ్యం వహించడంమాత్రమే కాదు. లెనిన్, స్టాలిన్లయొక్క మహత్తర భావవాహినిలో ప్రజలను విజ్ఞానులుగా చెయ్యడం అతి ముఖ్యం.

ప్రఖ్యాత సోవియట్ నాటకరచయి: కాన్‌స్టాంటిన్ సిమనోవ్ (యీయన కవి, గద్య రచయిత, జర్నలిస్టుకూడాను.) సోవియట్ దేశంలోనూ విదేశాలలోనుగల జీవిత క్లిష్టసమస్యలపై నాటకాలు వ్రాశాడు. ఆత దొకనాటకంలో సోవియట్ నైతిక సంపదను స్పష్టపరిచాడు. ఇంకోనాటకంలో హిట్లరైటులకు వ్యతిరేకంగా దేశభక్తియుత యుద్ధంలో సోవియట్ ప్రజల మహోన్నతమైనట్టి గంభీర స్వరూపాన్ని చిత్రించాడు. ఈ నాటకం పేరు "రష్యన్ ప్రజలు." ఆతడు వ్రాసిన "శత్రుచ్ఛాయ" అనే నాటకంలో సోవియట్ ప్రజల దేశభక్తినీ, జాగరూకతనూ చూపించాడు. "రష్యన్ సమస్య" అనే నాటకంలో అమెరికన్ అభ్యుదయ కాముకులు సోవియట్ దేశాన్ని నిందించేవారిని ఏవిధంగా బహిరంగపరుస్తున్నారో వ్యక్తిపరిచాడు. సిమనోవ్ నాటకాలు జయప్రద మవుతున్నాయంటే రచయితలోగల అమోఘమైన ప్రతిభవల్ల మాత్రమేకాదు. అంతకంటె ప్రధానమైంది, ఆతడు సమాజజీవితంలోని నూత్నలక్షణాలను అద్దంలా ప్రతిబింబింప చెయ్యగలడు కాబట్టి.

నేను మరికొన్ని పేర్లు చెప్పగలను : నికొలై

కి ష్మెర

పొగొడిన్,—యీతడు "తుపాకి మనిషి" అనే తన ప్రఖ్యాతనాటకంలో లెనిన్ మహాశయుని పాత్రను ప్రప్రథమంగా రంగస్థలంమీదకు తెచ్చినవాడు. యువకరచయిత, ఎనాటొలీ సురోవ్,—యీతడు రైల్వే కార్మికులగూర్చి వ్రాసిన "గ్రీన్ స్ట్రీట్" అనే రూపకంలో సోషలిస్టు శ్రమయొక్క ప్రాముఖ్యతనూ, ఔన్నత్యాన్నీ చిత్రించి ప్రేక్షకుల మెప్పు పొందేడు. అనుభవజ్ఞులైన సోవియట్ రచయితలలో ఒకడైన బోరిస్‌లావ్ రెనివ్ వ్రాసిన "ది బ్రేక్" అనే నాటకం ప్రజలలో పేరుబడసింది. ఈ నాటకం సోవియట్ నావికులగూర్చి, సోవియట్ నౌకాబలం అవతరించిన రోజులో వ్రాసినది. యీ నాటక మిప్పటికీ నౌకలలో ప్రదర్శింపబడుతూంది. ప్రస్తుత సోవియట్ నౌకాబలంలోని నావికులను చిత్రించే "నావికుల కోసం" అనే నాటకం ఆతడు మూడేళ్ళక్రితం వ్రాశాడు.

ఈ నాటకం ఘనవిజయం పొందింది. ఈతడు వ్రాసిన "అమెరికా కంఠం" అనే కొత్త నాటకాన్నిటీవల సోవియట్ థియేటర్లు ప్రదర్శించాయి. ఈ నాటకంలో రచయిత యుద్ధ ప్రేరేపకులను నిర్దాక్షిణ్యంగా బయటపెట్టేడు. వందలకొద్దీ గల రష్యను, యుక్రేనియను, బైలొరష్యను, జార్జియను, తదితర థియేటర్లలో యీ నాటకం ప్రదర్శింపబడుతూంది. అంతేకాదు, ప్రజా తంత్రదేశాలోనూ, స్వతంత్ర చైనాలోనూకూడా ప్రదర్శింపబడుతూంది.

నాటక రచయిత అలగ్జాండర్ కోర్నీచుకా (యుక్రేనియను రచయిత) ఆగస్టు జాగబ్‌సన్ (ఏస్తోనియను రచయిత), షాల్వా డాడియాని (జార్జియను) తదితర రచయితలు సోవియటు ప్రేక్షకులలో పేరు సంపాదించారు. వారి నాటకాలు కెయివ్, మాస్కో, ట్బిలిసీ, మిన్‌స్క్, టాలిను, లెనినుగ్రాడ్ మొదలైన పట్టణాల్లో ప్రదర్శింపబడుతున్నాయి. ఆధునిక ఇతివృత్తం, వస్తువులో విశిష్ట సిద్ధాంతం, భాషలో, స్వరూపంలో, సంవిధానంలో, నాట్యకళా గంభీరతలో పూర్ణత్వం యీ నాటకాల్లో గర్భితమై యున్నాయి.

# మన సాహిత్యంలో స్త్రీవర్ణన

రచన : శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

ఏ దేశసాహిత్యము జూచినను ఆ దేశ సాంఘిక, నైతిక, రాజకీయ పరిస్థితులందు ప్రతిబింబించు చుండును. అది నిరవద్యము. రచయితల స్వానుభవములు రచనలందు స్ఫోరకములగుటకూడ సర్వసామాన్యము.

సంస్కృతసాహిత్య మాంధ్రసాహిత్యమునకు గురుస్థానముగా నుండుటవలన, మన సాహిత్యములో సంస్కృత సాహిత్యములోవలె స్త్రీవర్ణన మపారము. స్త్రీ శరీర సౌందర్యమును వర్ణించుటలో ప్రబంధకవులు సంస్కృతకవులను, కవిత్రయమును మించిపోయినారు. కృతిభర్తలు రాజులు. రాజులు భోగపరాయణులు. భోగపరాయణులమనసు రంజింపచేయుటకు శృంగారరసము ప్రధానము. శృంగారమునకు స్త్రీ ముఖ్య వస్తువు. మరి స్త్రీలను వర్ణించుటలో భారతదేశకవులు ప్రపంచ సాహిత్యములో ప్రత్యేకస్థానమును గడించుటకు కారణ మీ దేశములోని సాంఘికపరిస్థితులు. స్త్రీ అబల. స్త్రీ భర్తను దైవముగా పూజించవలెనని మన శాస్త్రదృక్పథము. పరస్త్రీసంగమము పాపహేతువు. స్త్రీకి స్వాతంత్ర్య మస్వాభావికమని పెద్దల మూఢనమ్మకము. వనిత పురుషునివలె సర్వావయవములు గలిగి ఆలోచనాశక్తిగలిగి పురుషునికి బానిసవలె నుండి సేవాధర్మము నిర్వర్తించుట పుణ్యమను సనాతనాచారదృక్పథము భారతదేశమున విపుల ప్రచారము నందె. స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణము ఫలించని స్వప్నమువలె నైనది. ఫలించని కోరికలు ఫలించిన కోరికలుగల వారి కథలను పఠించడమువలన పఠితశాత్మలో తృప్తికల్గించును. ఇటువంటి మానసికానందము శృంగార రంగభంగిమలు పొంగిపొరలు ప్రబంధము ప్రజల కిప్పటికి నిచ్చుచున్నది. ప్రజల ప్రబంధ పఠనాసక్తికి కారణములలో నొకటి సంఘము స్త్రీపురుషుల మధ్యనున్న మానసికాశాంతి.

ఒకవంక ధర్మశాస్త్రములు పురుషుల కేకపత్నీవ్రతము, స్త్రీలకు పాతివ్రత్యము బోధించుచుండగా, వేరొకవంక ప్రజలకు సాహిత్యముద్వారా కవులు శృంగారమును అమృతపాత్రలలో నింపి పెదవుల కందించినారు. ఆ శృంగార ప్రబంధములలోకూడ వైదికాచారప్రాముఖ్యము, శాస్త్రాదరణము, ధర్మనిష్ఠ ద్యోతకమగుచున్నది. మనుచరిత్రలో ప్రవరాఖ్యుని పాత్ర వైదికాచారమునకు ప్రతిబింబము. కాని మనుచరిత్రను ప్రజలు వైదికాచార విశిష్టత నెరుంగుటకు పఠించుటలేదు. ప్రజ లందరి వరూధినీ కథాభాగముచే నాకర్షింపబడుచున్నారు. ఇట్లే తదితర ప్రబంధములు. మనకవులు స్త్రీలను వర్ణించెడి సందర్భములో వెనుక ముందులు చూడలేదు. పార్వతి, లక్ష్మి, సరస్వతిని వర్ణించినను, వరూధిని, గిరిక, కలభాషిణి, ప్రభావతి, సుభద్రలను వర్ణించినను వారి నొకరీతిగా అవయవవర్ణన మొనరించి వా రనాకారులని ప్రజ లనుకొనకుండునట్లు చిత్రించినారు. కథాభాగమున ఆయాస్త్రీల మానసిక సుగుణముల వర్ణించుటయందుకంటె, స్త్రీ శరీరావయవముల వర్ణనములో మన కవులు విశృంఖలముగా, మిన్నగా రచించుటకు కారణము మన దేశ సాంఘికపరిస్థితులు !

మన సాహిత్యములోవలె ఆంగ్లసాహిత్యములో స్త్రీ శరీరావయవములను వర్ణించుట కానరాదు. స్త్రీ ముఖము ఏప్రియలు ఉదయవేళవలె నున్నది! అని ఆంగ్లకవి వర్ణించును. వారిది చలిదేశము. ఎండకు కరువేర్పడి చలితో బాధపడెడివారికి ఏప్రియల్ మాసమున దోచు అరుణరేఖలు ఆహ్లాదకరమైనవి. ఆ అరుణరేఖలవలె స్త్రీముఖ మాహ్లాదకరమైనది.

ఆంధ్రసాహిత్యములో ప్రబంధయుగము అంతరించిన పిమ్మట-ఇటీవల ఆధునికకవులు స్త్రీలపట్ల చాల న్యాయముగ వర్తించినారు. వీరు బైరన్, షెల్లీ, కీట్సువలె ప్రణయ కవిత్వము రచించినారు గాని, తమ ప్రాచీన సాంప్రదాయమైన స్త్రీ శరీరావయవవర్ణనమును నిరాదరించుట మిక్కిలి శ్లాఘ



కి న్మై. ర

నీయము. కాని ఇప్పటివారిలో శ్రీ విశ్వనాథ సత్య నారాయణగారి "శృంగారవీథి" అను గ్రంథము ప్రబంధమార్గమున ఆఖరు మైలురాయివలె కనిపి స్తున్నది.

ప్రబంధకవులు గ్రంథప్రారంభములో ప్రార్థన పద్యములందే స్త్రీసౌందర్యోపాసన ప్రారంభించి తాము వ్రాయబోవు శృంగార ప్రబంధములకు విజ యము నాకాంక్షించినారు.

కవిత్రయము ప్రార్థన పద్యములలో స్త్రీమూర్తి అవయవముల నతిగా వర్ణింపకపోవుటవలన వారు వందనీయులు.

భారతములో స్త్రీ వర్ణనము అత్యంతరమణీయమై మనోజ్ఞాలంకారమంజులమై యొప్పుచున్నది. సం స్కృతసాహిత్య మాంధ్రసాహిత్యమునకు గురు స్థానము వహించియున్నదని ముందుగనే మనవి చేసుకొనినాను. అందువలన భారతమునకూడ స్త్రీ శరీరావయవవర్ణనము సూక్ష్మముగ లేకపోలేదు.

భారతములో, ప్రబంధములో నున్న యీ శృంగార రసము విద్యావ్యాసంగమం దభినివేశము గల కొద్దిమంది కందుబాటులో నున్నది. ఏమైనను స్త్రీ అవయవవర్ణనములో నతి వర్ణనీయమేగాని కోర దగినది కాదు. విదేశములలోవలె మన దేశమున కూడ స్త్రీపురుషులు నిజమైన స్వాతంత్ర్యము కలిగి యున్న, ప్రజల కీభావనాశృంగారపఠనముపై వాంఛ తగ్గిపోవును.

దేశమున సాంఘికవిప్లవము వర్ధిల్లినగాని సాహిత్యములో పురోగమనము లభ్యముకాదు.

మన సాహిత్యములో స్త్రీఅవయవవర్ణన మను స్యూతముగ వచ్చుచున్న ఒక సంప్రదాయము. ఈ వర్ణన ముండవలసినంత యుండిన జుగుప్స కలి గించదు.

భారతీయుసాహిత్యమునుం విదేశపండితుడు పరిశీ లించిన భారతీయులు శృంగారరసప్రియులని తప్పక భావించగలడు. అధికోష్ణదేశములో శృంగారరసా ధిక్యత యుండుట ప్రకృతి సిద్ధముగాని అన్యము గాదు. ఈ శృంగార రసాధిక్యత జాతి నున్నతి పరచు ననుట సందేహాస్పద విషయము. ఇది సాహిత్యమున కలంకారముమాత్రము.

—ఆంధ్ర వారపత్రిక (5-7-50)

## ఏమి శాశ్వతం!

రచన: శ్రీమతి ఆచంట శారదాదేవి.

"ఏమిటో! ఎట్లా ఉన్నా రోజులు గడచి పోతుంటాయి. ఏమి శాశ్వతం!" అనీ, "నాలుగు రోజుల భాగ్యానికి ఎందుకొచ్చిన అర్భాటం!" అనీ— ఇట్లాంటి మాటలు మనం తరుచు వింటూనే ఉంటాము. సర్వసాధారణంగా, చిన్నా పెద్దా వ్యత్యాసం లేకుండా, అందరూ అనే మాటలే ఇవి.

మనది ఆధ్యాత్మిక దేశం. మన పిల్లలకు విరక్తి ఉగ్గుపాలతో వస్తుంది. అందులో ముఖ్యంగా ఆడ పిల్లలకు, సంసార కష్టాల వలన నైతేనేమి, వేరే కారణాలవల్ల నైతేనేమి మనవాళ్ళు ఎప్పుడూ ఏదో విరక్తిగా, దేనిమీదా ఆసక్తి లేకుండా, నిటలాపాంగా ఉంటారు. ఈ వైరాగ్యం పరిపూర్ణమైన విజ్ఞానంచేత, సంస్కారంచేత, వచ్చినదైతే మంచిదే. మన దేశపు స్త్రీలు పసితనంనుంచీ ఆధ్యాత్మికచింత గలిగిన వారైనందుకు మనం ఎంతో గర్వించవచ్చు. అయితే ఈ వైరాగ్యం నిత్య జీవితంలో, ఆచరణలో కనుపించదు. కేవలం మాటలలో మాత్రమే. అదీ ఏదైనా తనకుగాని, సంఘానికిగాని, ఉపకరించే పనులు ఎవరైనా చేయ మని ప్రోత్సహించినప్పుడే, ఈ వేదాంత వాక్యాలు వస్తాయి.

నిజానికీ, ఈ విరక్తి ఒక విధమైన సోమరితనం, దేనిమీదా ఆసక్తి లేకపోవడం. నూతిలోని కప్పకు పైని కనపడే ఆ కాస్త ఆకాశమే విశ్వప్రపంచం అన్న రీతిని సంసారంలో ఐడి ఈదుకుంటూ ఉన్న

మనవారికి వంట, పెట్టు, అయి కాస్త తీరిక దొరికితే ఇరుగుపొరుగులను ఆడిపోసుకోవడం తప్ప ఏదైనా ఉపయోగకరమైన పనులు నేర్చుకోవాలి అనే కుతూహలం ఉండదు. తీరిక సమయం ఎందుకు వృథా చేసుకుంటారు?—ఆత్మ వికాసానికి పాటు పడకూడదా, అని అంటే ఎన్ని వేదాంతవాక్యాలైనా పలుకుతారు. "తామరాకుమీది నీటి బొట్టులా ఉండాలి" అంటూ ఎంతో విరక్తి చూపిస్తారు. ఇటువంటి వారిలో జీవితమందు ఉత్సాహం ఎలా కలుగుతుంది?

ఇతర దేశాలలో ఏభై ఏళ్ళు దాటిన తరువాత కూడ ఏ చిత్రలేఖనంలోనో, సాహిత్యములోనో అభిరుచి కలిగించుకుని ప్రతిభ గాంచినవారు ఎందరో! మనస్సు చురుకుగా ఉన్నంత వరకు, ఆసక్తి, ఉత్సాహం, ఉన్నంత వరకు, వృద్ధాప్యం అనేది లేనేలేదు. పాశ్చాత్యులు ఐహిక ఔన్నత్యానికి తగిన స్థానం ఇచ్చి ఎన్ని విషయాలలోనో ఆసక్తి, అభిరుచి కలిగించుకుని సాయశక్తులా పాటుపడతారు కాబట్టి లలిత కళలలో, విజ్ఞానంలో, పరిశ్రమలలో, అన్నింటిలోను మనకన్న ఎంతో ముందుకు వెళ్ళగలిగారు. మనకు అవకాశాలు లేవు అని అనుకోడం పరిపాటైంది; కాని నిజానికి మన వారికి తగిన ఆసక్తి, అభిరుచి లేకపోవడంవల్లే మన ఈ ఇప్పటి దుస్థితి. మాటవరసకు, ఓ కుటుంబంలో తండ్రికి ఆమె ఒక్కతే కూతురు. ఆమెకు ఏమి కావలసినా నేర్పించటానికి అతనికి ఏమీ అభ్యంతరం లేదు. అయితే ఆ పిల్లకు ఏమీ నేర్చుకోవాలని లేదు. ఆమెకు చదువు, సంగీతం లాంటివి ఏమైనా నేర్పించాలని ఆమె తల్లికి అంత కన్నా లేదు. రాత్రింబవళ్ళు తల్లి కూతురు కబుర్లు చెప్పుకుంటూనో, కీచులాడుకుంటూనో కూర్చుంటారు. ఎవరైనా చదువు సంగతి ఎత్తితే ఇద్దరూ వేదాంతం మాట్లాడుతారు. "ఆ: ఎందుకొచ్చిన చదువులు! నా రోజులు వెళ్ళాయి; దాని రోజులు వెళ్లవా!" అంటుంది తల్లి. "ఎందుకండి?— చదువుకున్న వాళ్ళు చచ్చిపోరా?" అంటుంది కూతురు. ఆ పిల్ల చాల తెలివిగా మాట్లాడాననుకుంటుంది. "మా అమ్మాయి ఏదో గొప్ప బాల యోగిని అవుతుంది" అని సంతోషిస్తుంది తల్లి. నిజానికి ఈ వైరాగ్యం, తెలివితేటలు, అన్ని విషయాల్లో కనిపిస్తే బాగానే ఉండును. ఇది కేవలం సోమరితనమే. రోజంతా వృథా కాలక్షేపం చేయటానికి అలవాటుపడి ఇంకేందులోనూ ఆసక్తి కలిగించుకోలేరు. ఆ తల్లి కూతుర్ల విరక్తి మాటలకు అర్థమే లేదు.

నిజానికి, చిన్నప్పటినుంచి కూడా పిల్లలకు దేంట్లో అభిరుచి ఉన్నదో కనుక్కొని దానికి అనుగుణంగా అవకాశాలు కల్పించవలసిన బాధ్యత తల్లులది. పరిపూర్ణమైన ఆత్మవికాసం గల స్త్రీలు పిల్లల మనస్తత్వాలను గ్రహించి వారి తెలివితేటలను వృద్ధిచేయగలరు. వాళ్లలో నిరుత్సాహం, నిస్పృహ కలిగించడానికి బదులు ఎప్పుడూ కొత్త కొత్త విషయాలు తెలుసుకోవాలన్న ఉత్సాహము, స్వశక్తిని వృద్ధి చేసుకో గలిగిన ప్రతిభ, అన్ని విషయాలలో అభిరుచి కలిగించాలి. అలా గాకుండా ఏమాత్రం మానసిక వికాసం లేని తల్లులు పసిపిల్లల జీవితాలను శాసిస్తూ ఉంటే బాధగానే ఉంటుంది. మనవాళ్ళు సంసారం సాగించి ఒక రిద్దరు బిడ్డల్ని కనగానే తమ జీవితం సమాప్తమైనట్లు భావిస్తారు. వారి వయస్సు ఏ ఇరవై ఏళ్ళకన్నా ఎక్కువ ఉండకపోవచ్చు. అయినా వారిలో ఏ విధమైన ఉత్సాహం, ఆసక్తి కనుపించదు. సంసార గొడవలవల్ల అవకాశాలు తక్కువగానే ఉండవచ్చు. అయినా ఆసక్తి ఉంటే ఏదో విధంగా అవకాశాలు కలిగించుకోవచ్చు.

తమ జీవితమంతా ముందే ఉందని, తమ పిల్లల భవిష్యత్తంతా తమ మీదనే ఆధారపడి ఉందని గుర్తించి, వీలయినంత వరకూ తమ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలన్న కోరిక ఉండాలి. ఎవరైనా హెచ్చరిస్తే, అరవయ్యేళ్లొచ్చి చదువుకోక మట్టి కొట్టుకోనా!" అని పరిహాసి దు. ఎందుకో ఇంత

వైరాగ్యం? జీవితంలో ఏది తప్పుతున్నది? అత్త గారిని సాధించటం తప్పదు. ఆడుబిడ్డలను వెక్కి రించడం తప్పదు. అందరినీ ఆడిపోసుకోవడం తప్పదు. నాది—పరాయిది అన్న కాంక్ష తప్పదు. "ఏమి శాశ్వతం! రోజూ మినపరొట్టి కాల్చుకు తింటా!" నన్నట్లుంది ఈ వేదాంతం. ఒళ్ళు బరువుతో జీవితం నీరసించి పోవడానికి తప్ప ఎందుకూ పనికిరారు. సోమరితనం, నిరాశ, నిస్పృహ పుట్టించే మాటలు ఒదులుకుని జీవితంలో ఆసక్తి వృద్ధిచేసుకోవాలి. ఉత్సాహం, ఆశ తొణికిసలాడాలి. పట్టుదలతో కృషిచేస్తే మన వాళ్ళలో మాత్రం ఎంతమంది చిత్రకారిణులుగా, కవయిత్రులుగా రాణించలేరు? అర్థంలేని ఈ విరక్తిలోనుంచి బయట పడితేనే ముక్తి!

—సౌభాగ్య (జులై 50)



న్యూయార్కు నగరంలోని డ్యాన్సు థియేటర్‌లో 1949 డిశంబరులో ఒక ప్రదర్శనం గావింపబడినది. పైచిత్రం అందులోని ఒక సన్నివేశం.

Printed by P. S. Venugopalaswamy Naidu at Vinodhan Press 33, jones St. Madras-1
Published by P. Mira Bai at 16, Jones St., Madras-1. Editor : P. Mallikarjuna Rao,